సంక్రాంతి సంచిక



చారెడుకళ్లకు
కాటుకపెట్టి
దోసెడుమల్లెలు
సిగలొ
చుట్టి...



అన్నపూర్ణా వారి

# పూలరంగడు



నిర్మాత డి.మధుసూదనరావు B.A.

కెమెరా పి.ఎస్.సెల్వరాజ్ • సంగీతం రాజేశ్వరరావు

దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు

స్టూడియో: శ్రీసారథి • నవయుగ విడుదల









# నగదుకు దగినంత పొదుకాపు...

## స్టేట్ బ్యాంకు ప్రయాణీకుల చెక్కులు




స్టేట్ బ్యాంకు ప్రయాణీకుల చెక్కులంటే చేతిలో నగదు ఉన్నట్టే. ఈ చెక్కులు రూ. 50/-, రూ. 100/- నోట్లరూపంలో దొరుకుతాయి. ఎక్కడైనా—విమానాశ్రయాలలో, హోటళ్ళలో, దుకాణాల్లో—చిక్కులేకుండా నగదు చేసుకోవచ్చు. ఒకవేళ పోగొట్టుకొంటే, మళ్లీ తీసుకోవచ్చు. ప్రయాణీకుల చెక్కులు సురక్షితంగా, సదుపాయంగా డబ్బు పట్టుకెళ్లే మార్గం.

మీరెక్కడికి వెళ్ళినా, స్టేట్ బ్యాంకు ప్రయాణీకుల చెక్కులు పట్టుకెళ్ళండి. కమిషన్ లేకుండా ఇప్పుడు దొరుకుతున్నాయి.

**స్టేట్ బ్యాంక్ సేవ నిమిత్తం**

S. 342 T4

# ఉత్తరాలు

పాఠకులందరికీ మా సంక్రాంతి శుభాకాంక్షలు. —సం॥

### ముఖచిత్రం

"ఆంధ్రుల పత్రిక అయినప్పటికీ, క్రిస్మస్ సందర్భంగా ఈ వారం, పత్రిక ముఖచిత్రం 'క్రీస్తు జననం' వేసినందున ఇక్కడి మా క్రిస్టియన్ ఫ్రెండ్స్ ఎంతో సంతోషించారు. వారి తరఫున నా తరఫున మీకివే నా కృతజ్ఞతాపూర్వక ధన్యవాదాలు."

ఎన్. వి. ఎస్. ఎన్. మూర్తి (బరంపురం)

### కథలు

22—12—1967 సంచికలో ప్రచురించబడిన కథ "రక్తం కురిసిన రాత్రి" ఉద్వేగపూరితంగా నడిచింది. త్యాగానికి (ప్రేమకు) సరియైన ప్రతిఫలం లభించని పరిస్థితిలో మానవుడిలో కలిగే సంఘర్షణ, పరిణామం చాలా చక్కగా చిత్రించిన రచయిత కథలో ఒకచోట 'టేబుల్ మీద బెడ్ రూం లైటు వెలుగుతుంది చెదరిన కుచ్చిళ్ళు ఒంటిమీద పమిట లేదు.' మొదలైన వర్ణన అసహజంగా అసమంజసంగా తోస్తుంది. అసలిది అనవసరమే అనిపిస్తుంది. పాఠకులను సుశీల పాత్ర విషయంలో అనుమానపూరితులను చేయటానికి ఏర్పాటుకు ముందు సంఘటన "ఈ రోజు అనుకోకుండా రాత్రి ఇంటికి తిరిగి రావటముచేత తన ఇంటి మెట్లు దిగుతున్న జగ్గడు కనిపించేడు" అంతవరకు చాలు.

ఆంధ్రపత్రిక అసంఖ్యాక అభిమాన పాఠకుల్లో దాదాపు 15 సం. నుంచి నేనూ ఒకణ్ణి అందుకనే ఈ విషయం వ్రాయకుండా ఉండలేక పోయాను

డి. యస్. రామారావు, (నిర్మల్)

* * *

కొలకలూరివారు వ్రాసిన "ఏముంటి నాకు?" అను కథలో "బుగ్గలు నొక్కులు పడ్డాయి. కను రెప్పలు కదిలాయి. కళ్ళు గుండెల్లోకి చూశాయి. నోరు తెరవకుండా సుతారంగా నవ్వింది రాణి" అని పలుసార్లు వ్రాసినారు. పూర్వకవులు నన్నయాదులు పద్యములలో మాత్రము "వృత్త్యనుప్రాస" నుపయోగించిరి. ఆధునిక కవులు కథలలో గూడ వ్రాయుట విశేషంగా ఉన్నది.

ముదిగొండ నాగేశ్వరరావు, (రాజమండ్రి)

### న్యూఢిల్లీలేఖ

'ప్రజల ఖర్చుతో మంత్రుల ప్రపంచయాత్ర' అని న్యూఢిల్లీ లేఖపై శ్రీకృష్ణగారు వ్రాసిన సమీక్ష నాకు అత్యంతానందాన్ని కలిగించింది. నేను ముఖ్యముగా ఆంధ్రసచిత్ర వారపత్రిక కొనుటది తమరు ప్రచురించు న్యూఢిల్లీ లేఖ చదవటానికి మాత్రమే. వారి సద్విమర్శలు ప్రచురించడం, చాలా మంచిది, అని నేను కోరుతున్నాను.

"విదేశయాత్రల కోసమే మంత్రులవుతూ వున్నారా?" శ్రీమతి ఇందిరాగాంధీ మేళంలో చేరి ప్రపంచయాత్ర చేయండి" అని వున్నది వున్నట్లు వ్రాస్తున్నందులకు వారికి నా యొక్క అభినందనలు. వారు ప్రస్తుత రాజకీయ అవకతవకలపై ఎక్కువ శ్రద్ధ తీసుకొని, ప్రచురించడం నాకు, మరియు ఆంధ్రసచిత్ర వారపత్రిక పాఠకులకు గర్వకారణము.

కె. బి. పతి, (కొత్తగూడెం)

### కార్టూన్లు

'కలిలోన తిండికి కరువొచ్చెనమ్మ
క్యూలోన నా కాలు గుల్లాయెనమ్మ'

సదానంద(భయ్యా) ఎంత బాగా రాశావు జాలిపాట. చదువుతుంటే నిజంగానే జాలి కల్గింది నాకు ఈ పాటకు తగు విధంగా వుంది బొమ్మ. ఇంత మంచి పాట రాసి పంపించిన సదానందంగారికి, నా ధన్యవాదాలు.

కుమారి ఈదర శకుంతల, (ఐతానగర్)






# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 19—1—'68
శ్రీప్లవంగనామ సం॥ పౌష్య మాసం ౫॥ చవితి
సంపుటము : 60 సంచిక : 20

స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
1, తంబుచెట్టి వీథి, మద్రాసు-1

పోస్టు ద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26.00 |
| 6 మాసముల చందా | 13.00 |
| 3 మాసముల చందా | 6.50 |


## విషయానుక్రమణిక

శ్రీకృష్ణ

# మదరాసీలు ఎవరు?

## భాషాచట్టం తీర్మానం ఎంతదాకా నిలవగలదు?

### కొత్తసంవత్సరానికి పాతసంవత్సరం కానుక

1968 కి మిగిలేది ఒక కలగూర గంప. మొట్టమొదటిసారిగా రాజధానిలో దుండగీళ్ళ విజృంభించటం చూడగలిగాము. వాళ్ళు ఆడవారిపట్ల దౌర్జన్యంగా ప్రవర్తించారు కొందరు చనిపోయారు కూడా. దీనికి కారణాలు లేకపోలేదు కొందరు కలిసి కార్లని ఆపి, వాటి అంకెలని హిందీ అంకెలుగా మార్చగలిగారంటే —'పోలీసులు చూస్తూ ఉండగా'—కానాట్ ప్లేస్‌లో కార్లని ధ్వంసం చెయ్యగలిగారంటే చావులు కాక మరేమి వస్తాయి? ఈ పెద్దమనుషులు ముందు తప్ప తాగి, ముక్కు నిండేదాకా తిని దారినవెళ్ళే వారిమీద రాళ్ళు రువ్వారు, నడిచేవారిమీద బెడ్డలు విసిరారు. ఒకావిడ బట్టలు ఊడదీశారు మరికొందరిని కొట్టారు, నగలు దోచుకున్నారు. ఒక వనిత చెప్పినది ఇక్కడ ఇస్తున్నాను;

'సుమారు ఏభయిమంది కుర్రవాళ్ళు నామీద పడి నన్ను గీరారు, నా రవిక చింపారు. నా వక్షంమీదా, మొహంమీదా, మెడమీదా గాయాలు పడ్డాయి. నా కారు దీపాలు పగలగొట్టారు. అద్దం విరక్కొట్టారు. ఇంతా ఒక పోలీసు ట్రక్కి నూరుగజాల దూరంలో జరిగింది.' ఈవిడ ఎవరోకాదు మాజీ ఇ.ఎస్.అయి. కార్పొరేషన్ డయిరెక్టర్ జనరల్ సతీమణి శ్రీమతి ఆల్బకర్క్.

ఇదే హిందీ సంస్కృతి కాంగ్రెసు నిస్సహాయతవల్ల, ఉదాసీన విధానంవల్ల మయినారిటీలలో భయాందోళనలని కలిగించింది—ప్రత్యేకంగా క్రయిస్తవ, మహమ్మదీయ దాక్షిణాత్య వర్గాలలో.

### మదరాసీలు అంటే?

హిందీ పక్షపాతులనబడే ఆంధ్ర, మయిసూరు ముఖ్యమంత్రులకి తెలుసో తెలియదో కాని హిందీ దేశంలో, రాజధానిలో ఆంధ్రులనీ, మయిసూరువారినీ కూడా మదరాసీలంటారు వారి ముఖ్యమంత్రులు హిందీని బలపరిచారని వారిని వదిలి వెయ్యరు. న్యూఢిల్లీలో ఆంధ్రులు చాలా మంది ఉన్నారు, వారి సంఘం ఒకటి ఉంది. హిందీవాదుల దృష్టిలో వీరందరూ 'మదరాసీ'లే ఆంధ్రప్రదేశ్‌లో హిందీ వ్యతిరేకోద్యమం బయలుదేరిందంటే, కేరళ ముఖ్యమంత్రి హిందీని బలవంతంగా ప్రవేశపెట్టరాదనటం మొదలు పెట్టారంటే, చివరికి జనసంఘం కూడా తన 'హిందీ విధానా'న్ని మార్చుకుంటున్నదంటే, లోహియా సోషలిస్టులు దక్షిణాదివారితో రాజీ కుదుర్చుకున్నారంటే రోజులు ఎలా మారుతున్నాయో అర్థం చేసుకోవచ్చు.

### ఇసుకమీద ఇల్లు

'ఒక తీర్మానం ద్వారా హిందీ — ఇతర ప్రాంతం వారి భవిష్యత్తుని కాపాడుకోవాలను కోవటం ఇసుక మీద ఇల్లు కట్టినట్టే. పార్లమెంటులో హిందీ వాదుల బలం మిథ్యాబలమేమో కాని రాజ్యాంగం మార్చటానికి కొంత మెజారిటీ అవసరం. చిన్న మెజారిటీ తీర్మానాన్ని మార్చుకోవచ్చు. చివరికి మిగిలేది హిందీ వర్గంవారి గెలుపు.

మయినారిటీల ప్రస్తావన వచ్చినప్పుడు శ్రీ మహమ్మదాలీ జిన్నా ప్రస్తావన కూడా అవసరం. సంయుక్త భారతదేశంలో తమ మతం వారికి రక్షణ అవసరం, హామీ అవసరం అనే వారు ఆయన. పాశ్చాత్య ప్రజాస్వామ్య విధానాలు భారతదేశంలో హైందవ రాజ్య స్థాపనకి దారి తీస్తాయనే వాదు ఆయన. నేడు అంతే పనీ జరిగింది. హైందవ రాజ్యంతో బాటు 'నాజీ' రకం 'బ్రవున్‌షర్ట్స్'లు విచ్చలవిడిగా తిరిగి ప్రజల ఆస్తినే కాక వ్యక్తి స్వాతంత్ర్యాన్ని కూడా నాశనం చేస్తున్నారు.

'రష్యన్ని ఎవరిని కోసి చూసినా లోపల టార్టార్ ఉంటా'డనే వాడు డిస్రయిలీ. అలాగే హిందీ కాంగ్రెసు వాదిని ఎవరిని కోసి చూసినా లోపల జనసంఘి ఉంటాడు. పార్లమెంటులో కాంగ్రెసువారిని జనసంఘీయులు, కమ్యూనిస్టులు, కాంగ్రెసువారిగా విభజించవచ్చు. మెజారిటీ మాత్రం జనసంఘానిదే. కాంగ్రెసు పార్టీలో హిందీ వర్గం తిరుగుబాటు అర్థం ఇదే. నెహ్రూ పాలన కింద ఈ వర్గం అణిగి మణిగి ఉండేది. ఇప్పుడు పయికి లేస్తోంది. ఈ సందర్భంలోనే మయినారిటీల — అందులో మహమ్మదీయుల—ధోరణిని పరిశీలించాలి.

### మహమ్మదీయుల భయాందోళనలు

అయిదేళ్ళదాకా, నెహ్రూ పరిపాలనలో, మహమ్మదీయులు కాంగ్రెసునే బలపరిచారు (ఉ. ప్ర., ఢిల్లీ, బీహార్‌లు

సంబంధించినంత వరకూ.) ఢిల్లీ పల్లె ప్రాంతాల నుంచి ఒకే ఒక కాంగ్రెసు సభ్యుడు పార్లమెంటుకి ఎన్నిక అయ్యాడంటే మహమ్మదీయుల కాంగ్రెసు పట్ల వారి నమ్మకం ఎంత ఉందో గ్రహించవచ్చు.

ఢిల్లీలో జనసంఘం గెలిచినంత మాత్రాన మహమ్మదీయులు జనసంఘాన్ని బలపరిచారనుకోవటం తప్పు. వారు వోట్లు వెయ్యకుండా మానుకునయినా ఉండాలి, లేదా కమ్యూనిస్టులకీ, తమ మతంవారికీ వోట్లు వేసిఅయినా ఉండలి. హిందీ రాజ్యంలో మహమ్మదీయులు తమ సంస్కృతి నాశనం తథ్యం అనుకుంటున్నారు. అయితే, మహమ్మదీయ పరిపాలనలో హైందవుల పరిస్థితి ఎలా ఉండేది, అని అడిగితే--రెండు తప్పులు ఒక సరికావు; తలిదండ్రుల పాపాలకి పిల్లలని శిక్షించటం తప్పు అని జవాబు ఇవ్వవలసివస్తుంది. అవురంగజేబు చేసిన

# న్యూఢిల్లీ లేఖ

తప్పులకి నేటి ముసల్మానులని బాధించటం సరికాదు.

అంతేకాక, మహమ్మదీయులు వేరు సహాయంకోసం కమ్యూనిస్టుల వయిపు తిరుగుతున్నారు. ఇటువంటి అల్పసంఖ్యకులమీద కమ్యూనిస్టుల ప్రభావం అధికం కావటం దేశానికి ముప్పు.

భాషా సమస్య నశించిపోవటం లేదు. ఉధృతం అవుతోంది. క్రమంగా దక్షిణ దేశం ఏకమవుతోంది!

## కేంద్ర విశ్వవిద్యాలయాలు

ఢిల్లీ విశ్వవిద్యాలయం కేంద్ర విద్యాలయం. ఇది అఖిలభారత స్థాయికలది. కొందరు విద్యార్థులు ఇందులో ఇంగ్లీషుని రద్దు చెయ్యాలనటం ప్రమాదకరం.

ఢిల్లీలో ఎన్నో అఖిలభారత సంస్థలు ఉన్నాయి. ఆల్ ఇండియా మెడికల్ ఇన్‌స్టిట్యూట్, ఇండియన్ అగ్రికల్చరల్ రిసర్చ్ ఇన్‌స్టిట్యూట్ మొదలయినవాటిల్లో హిందీ విద్యాభ్యాసభాష అయినట్లయితే అవి తమ అఖిలభరత స్థాయిని కోలుపోతాయి. హిందీలో ఇంజనీరింగ్ సర్జరీలకి టెక్స్‌ట్‌బుక్స్ లేవు. వీటిని మూసివెయ్యవలసివస్తుంది.

ఒక విచిత్రం: దేశాయి ఎన్నో ప్రాజక్టులకి డబ్బు లేదంటారు. కాని, హిందీలోకి పుస్తకాల అనువాదానికి 30 కోట్లు కేటాయించటం జరిగింది. ఢిల్లీ టెలివిషన్ ప్రోగ్రామ్‌లలో హిందీ ప్రచారం జరుగుతోంది. ఇందులో వాడే ఎన్నో మాటలు ఉత్తరాదివారికే ఎందరికో అర్థం కావు!

ఇక తీర్మానాన్ని అమలుపరిచే వారంతా ఢిల్లీలో ఉంటారు. వారు హిందీవాదులు. అంటే, పోట్లాట రోజురోజుకీ పెరుగుతోంది. ●


చూడు ప్రపంచం చాలా మారింది
పాతసిద్ధాంతాలు
స్వతంత్ర, కమ్యూనిష్టు ఎస్ ఎస్ పి వారు వైదొలగినప్పటికీ యు.పి. మంత్రి వర్గం కొనసాగుతోంది
యు.పి. మంత్రి వర్గం
నేను ఒంటి కాలు కుర్చీ మీద కూర్చోలేనని ఎవరంటారు!
చరణ్ సింగ్
కేరళలాగా మార్క్సిస్టుల వొత్తిడి విపరీతంగా ఉంది.
నా షరతులకు ఒప్పుకొని నన్ను పెళ్ళాడ్తావా!
సోషలిస్టుల సమైక్య కృషిలాగా అభివృద్ధి ఏమీ కన్పించలేదు!

# శంకరం సంక్రాంతి డయిరీ

నాపేరు శంకర్రావు. నన్నంతా శంకరం అంటారు. నాకు అమ్మా నాన్నా అన్నా అక్కా చెల్లీవున్నారు. అన్న కాలేజిలో చదువుకుంటున్నాడు. అక్కకి మొన్నే పెళ్లయింది. అన్నకీ నాకూ మాచెల్లెలికీ యింకా కాలేదు.

సంక్రాంతిపండగ వస్తోందంటే మా యింట్లో బోల్డంత సందడి సంక్రాంతి పండగ అంతా మాయింట్లోనేవుంటుంది.

సంక్రాంతిపండగ రాకుండనే నాకు ముందుగా తెలిసిపోతుంది. ఎలాగంటే, మా యింటికి సున్నం వేయిస్తారు. మా అక్క తెల్లారగట్లే లేచి ఇంతింత పెద్ద పెద్ద ముగ్గులువేస్తోంది. తెల్లారి తొమ్మిది గంటలైనా లేవని మాచెల్లికూడా ఆమెతో పాటే లేస్తోంది. అప్పుడు సంక్రాంతి పండుగ దగ్గరపడిందని తెలిసిపోతుంది.

మొన్నొకసారి మాయింట్లో పెద్ద గొడవ జరిగింది. అంతా పెద్దవాళ్ల గొడవ. నాచిన్నిచెవుల్లోపడింది గనక నాకూ కొంచెం అర్థమయింది. మాబావ పండక్కి రానన్నాడట. మోటారు సైకిలిస్తేగాని రానన్నాడట. ఏమిటోగాని, మాబావ రాకపోతే పండుగ ఆగిపోతుందా? మా అమ్మా నాన్నలది ఒకటే చాదస్తం. ఆవిషయంమీద గంటలకొద్దీ కీచులాడుకున్నారు. రోజులకొద్దీ ఆలోచించారు. మా అక్క సంగతి సరేసరి! ఒకటే ఏడుపు. 'వచ్చినప్పుడే వస్తాడులే' అన్నాడు అన్న. అమ్మవాడిమీద కసురుకుంది. అక్క నాల్రోజులు అన్నతో మాట్లాళ్లేదు. నాకూ అన్న అన్నట్టుగానే అనాలనిపించింది. కాని, బావవస్తే నాకూ ఒకందుకు మంచిదే బావకి రక రకాల పిండివంటలుచేస్తారు అంటే, పండక్కి మామూలుగా చేసుకునే వాటికంటే అదనమైనవన్నమాట! వాటిలో నాకూ భాగం దక్కుతుంది. అందుకే అన్నన్నట్టు నేనన లేదు. బావ రావాలనే నాకూవుంది. సరే నాన్నగారు రమ్మని ఉత్తరం రాసేశారు.

ఇదికూడా సంక్రాంతిదగ్గర పడుతున్నదని చెప్పడానికి ఒక ముందుమాట!

మా అక్క ఎన్నెన్నో రకరకాల ముగ్గులువేసేది. నాకుకూడా ముగ్గులు వేయాలని సరదాగావుండేది. కాని అక్క 'ఆడంగారి వెధవా...' అని తిడుతుంది. అందుకు ఆ అభిప్రాయాన్ని మార్చేసుకున్నాను.

చాలరోజులనుంచి నేను చిట్టిచిట్టి పిడకలుచేయడం ప్రారంభించాను. అవన్నీ చాలా అయ్యాయి. వాటిని పొడుగాటి దండగా గుచ్చడమంటే నాకు సరదా. ఎండిన పిడకలనన్నింటినీ దండ గుచ్చుతుంటే చెల్లివచ్చింది. 'మగరాయుళ్లా నీకు పిడకల దండేమిటి? పో పోయి ముగ్గులేసుకో' అని గసిరాను. అది వెళ్లలేదు. నా ప్రక్కనే కూర్చుంది. ఒక్క పిడకా అందివ్వమన్నాను. దానికి బోల్డంత సంబరమయింది.

ఈ మధ్య మా వూళ్లోకి చాలా గంగిరెద్దులు వస్తున్నాయి. నేను ఒకనయాపైసావేశాను. గంగిరెద్దులవాడు గంటకొడుతూ నామీదపాటపాడాడు. గంగిరెద్దుచేత దండం పెట్టించాడు.

ఒకరాత్రి మా వీధిలోనుంచి గంగిరెద్దులు వెళ్తున్న చప్పుడు వినిపించింది. నాకు అప్పుడప్పుడే నిద్రపడుతూవుంది. గంగిరెద్దుల చప్పుడుకి లేచి వీధిలోకి పరుగెత్తాను. గంగిరెద్దులు, కొందరు మనుషులు మా వీధిలోనే ఆగి మానాన్నగారిని బతిమాలుకుంటున్నారు. ముందు కాదన్నారుగాని చివరికి మా నాన్నగారు ఒప్పుకోక తప్పలేదు. నా కప్పుడు ఎంతో సంతోషమయింది. వాళ్లకీ సంతోషమైంది. మా నాన్నగార్ని తెగపొగిడేశారు. సన్నాయిమీద అనేకపాటలు పాడి వినిపించారు. గంగిరెద్దుచేత ఎన్నో ఆటలు ఆడించారు. వూరువూరంత మా వాకిట్లోనే కూర్చున్నది అందరూ ఆటని ఎంతో ఆనందంగా చూస్తోంటే నాకు భలేసరదా పుట్టింది. అందరిలోనూ ఛకచకా తిరిగేశాను

తర్వాత వొకనాడు మల్లివాసులవాళ్లు వచ్చారు. వాళ్ల ఆడినఆట సరదాగానే వుంటుందిగాని, భయంవేస్తోంది నాకు. 'పెద్దకాళ్లవాడు' వచ్చినప్పుడుసంతోషంతో చప్పట్లు కొట్టాను. ఆట ముగింపుకు వచ్చేముందు పులివేషం వచ్చినప్పుడు కళ్లు మూసుకున్నాను. మా అమ్మ నన్ను ఒడిలో కూర్చోపెట్టుకుంది. మాచెల్లి మావాళ్ళ

... మీద అడుగు పెట్టొద్దు



గార్ని బల్లిలా కరుచుకుంది.

ప్రొద్దున్నే హరిదాసు వస్తాడు హరిదాసు చక్కని కీర్తనలు పాడతాడు తెల్లవారుజామునే మేలుకొలుపు పాడుకుంటూ వూరిచివరికి వెళ్తాడు వచ్చేటప్పుడు అందరి ఇళ్లదగ్గరా ఆగుతూ పాటలుపాడతాడు అందరూ అతనికి బియ్యమో, పైసలో వేస్తారు అతని చిడతలన్నా కాలి అందెలతో వేసే గంతులన్నా నాకు చాలా యిష్టం

తెల్లారితే భోగిపండగ అనగా భలే సరదాగా వుంటుంది భోగిమంటకోసం ఎక్కడెక్కడి పుల్లలూ ఒకచోటికి చేరేస్తారు మావూర్లో రామాలయం వుంది ఆ రామాలయందగ్గర ఏటేటా ఈపెద్ద భోగిమంటని వేస్తారు

మా అన్న మానాన్నతో చెప్పకుండా పెద్దపెద్ద చెట్లన్ని కొట్టడానికి తన తోటివాళ్లతో కలిసి వెళ్లాడు రాత్రయితే చాలు,ఏపనికీ బయటికి వెళ్లని మా అన్న అర్థరాత్రి నిద్రగన్నేరు చెట్లని కొట్టడానికి వెళ్లాడు ఆ చెట్లని రాత్రికిరాత్రే రామాలయందగ్గర జేరేస్తారన్నమాట! నేనుకూడా వస్తానన్నాను అన్న కోప్పడ్డాడు నాన్నతో చెప్తానని భయపెట్టాను 'ఏమూ చెప్తాను సిగురించి' అని నన్ను తిరిగి భయపెట్టాడు. కోమటి సుబ్బయ్యగారి పశువులపాకలోని గుంజలు భోగిమంట్లో వేయడానికి నేను చాటుగా ఎత్తుకువచ్చాను! అందుకు నేను మళ్లీ ఏమీ మాటాడకుండా మా మిత్రులతో కలిసి తిరిగాను

తెల్లారుఝామున మా అక్క గొబ్బిపాటల్తో నాకు మెలుకువ వచ్చేసింది మా అక్క వాళ్ల స్నేహితురాళ్లు కలిసి ముగ్గువేసి, అందులో బంతిపూలుపెట్టి, దానిచుట్టూ తిరుగుతూ పాటలు పాడుతున్నారు మాచెల్లాయి ఎప్పుడు లేచిందోగాని, వాళ్లవెనక అదికూడా గంతు లేస్తున్నది అరుగుమీద ముఖం కడుక్కుంటూ మాబావ వాళ్లని చూస్తూ నవ్వుతున్నాడు

మా అమ్మ నాకు తలంటిపోసింది కొత్తబట్టలు తొడిగింది అప్పటికే వూళ్లో పిల్లలంతా రామాలయం దగ్గరికి వెళ్లిపోయారు, నేనూ, నా పెడకుదండ పుచ్చుకుని అక్కడికి పరుగెత్తాను నాదండ చూసి అక్కడున్న పిల్లలంత ఆశ్చర్యపోయారు మా అన్న నాదండని పెద్దపెద్ద మంటలతో చిటచిటలాడుతూ వెలుగుతున్న భోగి మంటలో వేశాడు వెంటనే రవ్వలు లేచాయి

పెద్దపండగ కూడా అలానే సంతోషంగా గడిచిపోయింది నాకారోజు అంత బాగా అనిపించలేదు కనుమపండగరోజు మరీ సరదాగావుంది ఆరోజున ఎద్దుబళ్లన్నిటికీ రంగులు వేశారు వూరంతా ఎంతో ఉత్సాహంగ వుంది

మావూళ్లో పెద్ద ప్రభని కడుతున్నారు మధ్యాహ్నం జరిగే ప్రభల తీర్థానికి దాన్ని అలంకరించడం మొదలెట్టారు ఊళ్లో రకరకాలైన చీరల్ని అడిగి పట్టుకెళ్లి దానికి చుడుతున్నారు దాన్ని పూర్తిగా అలంకరించేవరకూ అక్కడే వున్నాను

మేళతాళాలతో దానిని భుజాలమీదికి ఎత్తుకుని తీర్థం జరిగే ప్రదేశానికి మోసుకుపోయారు నేను యింటికి వచ్చేశాను

అన్నం తిన్నాను తీర్థానికి వెళ్దామన్నాను నాన్నతో 'ఇప్పుడేం తీర్థంరా నాలుగింటికి వెళ్దాం' అన్నాడు నాన్న నాలుగవడానికి చాలా కాలమయింది!

నాలుగు గంటలకల్లా ఇంట్లో అందరూ ముస్తాబై తీర్థానికి వెళ్లడానికి సిద్ధమయ్యారు అందరం తీర్థంలోకివచ్చాం

తీర్థానికి చాలా ప్రభలు వచ్చాయి అందులోకీ మావూరి ప్రభే చాలా ఎత్తయినది అన్ని ప్రభలదగ్గరా ఎంతో కోలాహలంగావుంది కోలాటాలు, భజనలు, భోగంమేళాలు ఒకటేమిటి చాలా హడావుడిగావుంది మా అక్క ప్రభలకి అరటిపళ్లుపెట్టింది నేను ఆటవస్తువులు తినుబండారాలు ఎన్నో కొనుక్కున్నాను తీర్థంనుంచి తిరిగివస్తుంటే అనిపించింది—మూడురోజుల ఈ పెద్ద పండగా మళ్లీ సంవత్సరంవరకు రాదుకదా అని!

—'రాజు'

## ఒకవారం విపరీతం

# బహుమతి యివ్వని బావమరిది హత్య

ఓ విఖ్యాఒడ్డి క్రిస్టమస్ పండుగ ప్రజంటుగా తన కివ్వమంటే యివ్వలేదని ఒకాయన తన బావ మరిదిని కాల్చి చంపాడట. ఇది మణిలాలో 26 డిశంబరున జరిగింది.

* * *

రమనాథపురానికి 14 మైళ్ళ దూరంలో వున్న కొజాకరి అనే ఊర్లో ఒకింటిముందు జరిగిన త్రొక్కిడిలో ఆరుగురు చనిపోయారనీ, ఓయిద్దరు గాయపడ్డారనీ తెలిసింది రంజాన్ సందర్భంగా ఒక ముస్లిమ్ ఇంటి ముందు కొన్నివేల మంది గుంపుగ నిలబడ్డారట. ఇది తెలిక ఓ యువకుడు మసిదు కెళ్ళాలని తలుపు తీశాడట. ఒ యట నిలబడి వున్న వాళ్ళు హొక్కుమ్మడిగా లోపలకు జొరపడటంలో యీ విషాదం సంభవించిదట.

## కప్పల యుద్ధాలు—ఆత్మహత్యా-అశుభం!

బాంగ్‌కాక్‌వద్ద డిశంబరు 22 వ తేదీన వేలాది కప్పలు ఒకే మాళ్లపొదమీద దూకి, ఆత్మహత్య చేసుకున్నాయట. రెండేళ్లక్రితం బాండారన్ లాయంగ్ వద్ద యిలాగే కప్పలు మూకుమ్మడిగా ఆత్మహత్య చేసుకున్నాయట గతవారంలో సూరత్ తానిలో పేర్వేరు ఎర్నంకల చిరుకప్పల మధ్య యుద్ధం సాగిందట. వీటి సంఖ్య సుమారు పదివేలట ద్వితీయ ప్రపంచ సంగ్రామంలో యిలాగే చిరుకప్పల యుద్ధం జరిగిందనీ, ఆ తరువాత యిది వసి అనడమేగాక, యిది ఒకరకంగా అశుభసూచి అనీ, అపశకునమనీ భావిస్తున్నారు

* * *

నవంబరు 27 న రాత్రి అనంతపురంలో శ్రీ నాగయ్య అనే ఆయనను, ఆయన భార్యనూ గొంతు పిసికి చంపేశారు అన్నకేసు దర్యాప్తులో వో అయిదు గురిని డిశంబరు 23 న అరెస్టు చేశారు. స్థానిక సారావ్యాపారి, అతని యిద్దరు తమ్ముళ్లు, మేన ల్లుడు యీ దురాగతం చేశారని అంటినా వారి వద్ద 58 తులాల బంగారం దొరికిందట

## స్త్రీ వితృష్ణనా?

ఆ మధ్య తొక్కిడిలో తిరుపతి తిరువుల కొండమీద కొంతమంది చనిపోయారు ఈమధ్య (డిశంబరు 23 న) తిరుపతి ఘాట్‌రోడ్డుమీదా పోతున్న ఒక కారును ఆపి, 150 రూపాయల మోదు ఎవరో దోచుకున్నారట. అయితే యీ దుండగులు స్త్రీలనూ, వారి నగలనూ తాకనేలేదట. గుడ్డిలో మెల్ల ఆ మధ్యన అదే మొట్టమొదటి విషాదమన్నారు ఈ మధ్యన యిదివిని యిదే మొట్ట మొదటి విషాద సంఘటన అంటున్నారు క్ష్ వివిటో!

## సింహాల షికారు

గిర్ అడవుల్లో వుండే సింహాలలో వో డజను మంజపూర్ (జునగడ్) అనే గ్రామ ప్రాంతానికి షికారుకు వచ్చేసరికి ఆ ప్రాంతంలో పనిచేస్తున్న కార్మికులు భయపడి, వాటి మీద రాళ్ళు రువ్వరట ఆ సింహాల్లో వో సింహారాజా ని కోపంవచ్చి యిద్దర్ని చీల్చి చెండాడి, కొంత మందిని గాయ పరచి, తిరిగి తన మందలో కలిసిపోయిందట.

## విష సర్పాలమధ్య 70 గంటలు

ఒక వెడల్పయిన గోతిలో నూరు విష సర్పాల మధ్య 70 గంటలకాలం గడిపి, క్షేమంగ తిరిగి వచ్చి క్రొత్త రికార్డు స్థాపిస్తానని పోర్ట్ ఎలిజబెత్‌లో ఒకాయ నన్నారు ఆ యన తనకు పాముల జాతులు, వాటి మనస్తత్వాలు చక్కగా తెలుసు ననీ, వాటి వాతపడకుండా తిరిగి గోతిలోంచి 70 గంటల తర్వాత రాగలననీ ఆ యనన్నారట జనవరి 5 వ తేదీన ఏ ఆ యుధమూ లేకుండా చిన్నలాగూ, చొక్కా తొడుక్కొని ఆ గోతిలోకి దిగుతారటా యన— శుభమస్తు.




## ఒకే కాన్పులో అయిదుగురు పిల్లలు

ఇన్‌బెన్‌లో ఒకాసుపత్రిలో 36 ఏళ్ళ పాట్రిటికా మేరీ బ్రహం అనే ఆవిడకు ముగ్గురు ఆడపిల్లలు, ఇద్దరు మగపిల్లలు ఒకే కాన్పులో పుట్టారట జామ్‌నగర్‌కి చెందిన కావిడ రైలులో ప్రయాణం చేస్తూ ఇద్దరు పిల్లలను ప్రసవించి, వారణాసి ఆసుపత్రిలో మూడో పిల్లను కన్నదట. యాభై తొమ్మిది ఏళ్ళ జల్వంతర్ కౌర్ అనే ఆమె మొన్నీ మధ్య 13వ సంతానాన్ని కన్నదట. అం దర్నూ సజీవులేనట. విశేషమేమిటంటే —ఆ రోజున ఆమె కుమార్తె, కోడలు కూడా ప్రసవించారు వారికీ మగపిల్లలేనట.

* * *

ఓడలోంచి సామానులు క్రిందకి దింపిస్తున్న మీనన్ అనే ఓడ అధికారి మీద క్రేనులో సామాను ప్రమాదవశాత్తు పడి, ఆయన తల పగిలిపోయిందట మద్రాసు స్టాన్లీ ఆసుపత్రికి తీసుకువెళితే అక్కడ చనిపోయారట ఇది 28 డిశంబరున జరిగింది

## అంతు తెలిని హత్యలు!

శాంతో డొమింగో (ఫిరెన్) అనే చోట డిశంబరు నెలలో తేలిన లెక్కలను బట్టి 22 అంతు తెలియని హత్యలట. అన్నీ కూడా ఒకేరకంగా జరిగాయట చెరకు పంట మీద జల్లే పదార్థం వంటి విష పదార్థం ప్రయోగించి చేసి వుండాలి అని తేల్చినా, ఎవరు, ఎందుకు చేశారో మాత్రం కనుక్కోలేక పోయిందటా శాఖ

* * *

గోహతిలో గోల్‌పరా జిల్లాలో 'కిష్ణబాలి' అనే గ్రామంలో మున్షీ ఉమద్ అలీ అనే ఆయన తన నూట ఎనభై రెండవ జన్మదినోత్సవం జరుపుకుంటూ, "నేను చాలా ఆరోగ్యంగ వున్నాను. సునాయాసంగా యింకా కొన్ని దశాబ్దాలు బ్రతుకుతాను" అన్నాడట. ఆసియాలోనే చాలాకాలం బ్రతికిన మొట్టమొదటి వ్యక్తిట ఈయన.

## తొంభైయ్యోఏట తండ్రి

వర్సాలో ఒకాయన తన తొంభైయ్యో యేట తండ్రి అయ్యాడట. ఈయన కింత క్రితం పలుగురు కొడుకులట. పెద్దకొడుక్కి 68 ఏళ్ళట.

—ఫాలాక్షుడు ●

# మూన్ రేకర్ -16

## జేమ్సుబాండ్ బొమ్మల సీరియల్













పళ్లతో డ్రాక్స్ లైటర్ని గాలా దగ్గిరికి తోశాను.

...తర్వాత టార్చి..

..పంపుకొట్టాను..

మళ్లీ పళ్లతో లైటర్ని వెలిగించి టార్చిని కూడా వెలిగించాను, నా ముహం కాల్చుకున్నప్పటికీ..












—గాలా, ఈ టార్చితో నీకట్లు కాల్చేస్తాను. చివరికి కొంచెం నెప్పెట్టచ్చు

మంట రాగి తీగెలని కాల్చేసింది. గాలాకి బాగ [illegible] ఉండి ఉంటుంది కాని ఆమె ఏమీ అనలేదు

తర్వాత టార్చితో ఆమె నన్ను విముక్తుడ్ని చేసింది










—గాలా నువ్వు భలే పిల్లవి.

—కొంచెం శుభ్రం అయిన తర్వాత అంత పిల్లని కావచ్చు డ్రాక్స్ షవర్ గదిని వాడ్తాను.

—నేనేమో అతని విస్కీ వాడ్తాను.

—అబ్బ ఇప్పుడు కాస్త హాయిగా ఉంది.

—గుడ్ డ్రాక్స్ గైరోలని ఎక్కుపెట్టటానికి తిరిగి వచ్చేముందే మనమేమి చెయ్యాలో ఆలోచించాలి

గైరోలు! జేమ్స్ నాకొకటనిపిస్తోంది!




జేమ్స్, ఇలా చూడు! డ్రాక్స్ తిరిగివచ్చి గైరోస్‌ని పెట్టిన తర్వాత వాటిని తిరిగి మనం యథాస్థానానికి మార్చెయ్యొచ్చు.

—రాకెట్ లండన్ మీదపడే బదులు ఉత్తర సముద్రంలో పడుతుందన్నమాట.

—పని చెయ్యొచ్చు, మనం కనక ఎక్కడయినా దాక్కొనగలిగితే, మనం తప్పించుకు పోయామని డ్రాక్స్‌ని నమ్మించగలిగితే వెంటిలేటర్ షాఫ్ట్ మాటేమిటి?




రాకెట్ స్థావరం గోడలలో నుంచి నేరుగా పయికి దొలిచి ఉన్నాయి వెంటిలేటర్ షాఫ్ట్‌లు. కొంతదూరం పయికీ, తర్వాత అడ్డంగానూ ఉన్నాయి. బయటి గోడల జల్లెడల దాకా

—రా గాలా! పయికి పోవాలి.

క్రమంగా, కష్టం మీద షాఫ్ట్ పయికి ఎక్కి వెళ్లాము.




తెల్లవారేసరికి నేనూ గాలా వెంటిలేటర్ షాఫ్ట్ చివర ముడుచుకుని కూర్చుని ఉన్నాము తర్వాత...

—డీ ఎంగ్లాండర్! తప్పించుకుపోయారు!

—హెర్ కాపిటాన్ డ్రాక్స్ వాళ్లు వెంటిలేటర్ షాఫ్ట్‌లలో ఒకదానిలో ఉన్నారనుకుంటున్నాడు! ఆవిరి గొట్టాలతో పంపి కనుక్కుందాము.

(ఇంకా ఉంది)




**కె. వి. పి, నెల్లూరు**

నేడు వెలువడుతూన్న నవలలపై మీ అభిప్రాయం.

చదవడానికి బాగుంటున్నాయి.

**ఎమ్. ఆర్. ఆర్, సికింద్రాబాద్**

అక్కయ్యా, మనసులు కలిసిన తరువాత మనుషులు దూరం అయితే మమత ఎక్కువ అవుతుంది. ఎందుకు?

ఎదుటలేని వ్యక్తిమీద విలువ పెరగడం సహజం తమ్ముడూ

**ఎస్. కె, కొవ్వూరు**

నిజంగా కట్నం వద్దంటే 'అబ్బాయికి ఏమైనా దుర్గుణాలు ఉంటాయి. లేకుంటె ఎందుకు కట్నం దీసుకోడు' అన్నారు దీనికి మీ సమాధానం?

సమాధానం ఏముంది? పాపం ఆ పిల్లదానికి కళ్యాణయోగం లేదని అనుకోవడం తప్ప!

**జి బి. వి. ఆర్, అల్లగడ్డ**

'అన్ని రసముల కాదదే అగ్రగణ్య' అని ఎక్కడో చదివాను. మగవాడు కాదా?

కాదని ఎవరన్నారు? అసలే నే!

**బి. ఆర్, కొత్తగూడెం**

అందం అంటే ఏమిటి? స్త్రీలో అందం ఎక్కడ ఉంది?

అందం అన్నది ఒక భావన. అది చూసేవారి కళ్లలోనే ఉంటుంది.

**జి. సి, మచిలీపట్నం**

నేను ఏ పని చేస్తున్నా ఏదో ఆలోచన చేస్తూ ఉంటాను తగ్గడానికేం చేయాలి?

ఉట్టి బుర్రకంటే ఆలోచనలున్న బుర్రే మెరుగు కదండీ, ఆలోచనలు సాగనీయండి.

**బి. ఎస్. కె. ఆర్ హైదరాబాదు**

'చెడబుట్టారు' అన్న మీ సమాధానం నాకు నచ్చలేదు.

మీ ఉత్తరం చదివాను. ఎంత చెడు తల్లిదండ్రులకు పుట్టినవారైనా— అభిప్రాయభేదాలు ప్రకటించవలసి వచ్చినా గౌరవించుకుంటూ ఉండడం తగిన పని అని నా నమ్మకం.

**డి. వై, హైదరాబాదు**

మంచికీ చెడుకీ గల మధ్య దూరం ఎంత?

మంచికీ చెడుకీ మధ్య ఉన్నంత దూరమే!

మనిషి మనిషిగా ఎప్పుడు గుర్తించబడతాడు?

అతగాడు నిజంగా మనిషి అయినప్పుడు.

**ఆర్. ఎమ్. పి. వైజాగ్**

మీకు మరేదైనా ఉద్యోగం ఉందా?

లేదు.

**ఎస్. ఎమ్, కంభం**

మా పొరుగింటావిడతో మాకు పెద్ద పేచీ అయిపోయిందండీ!

స్వంత ఇల్లంటున్నారు కనుక మధ్య గోడ ఎత్తు పెంచండి!

**వి. ఎల, యద్దనపూడి**

నేను, నక్షత్రములు, ఆకాశము, గ్రహములు, వీనిని అంతులేని ఆసక్తితో రోజూ పరిశీలిస్తాను. అప్పుడప్పుడు ఉదయించే అనుమానాలు ఎవరితో సంప్రదిస్తే తెలుస్తాయి.

ది మద్రాస్ అస్ట్రానమికల్ ఎసోసియేషన్. 15, అభిరామపురం, మొదటి వీధి. మద్రాసు–18కి వ్రాస్తే, ఇటువంటి సరదాలే ఉన్నవారితో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపే అవకాశం కల్గుతుంది.

**టి. వి. ఎస్, కావలి**

కోరికలకు అతీతులుగా ఉండాలని కోరడం కూడా కోరిక అవునా? కాదా?

బాగా చెప్పావు తమ్ముడూ, ఇంతటి నిజాన్ని కాదని ఎలా అంటాను?

**ఎమ్. ఎమ్, హైదరాబాదు**

కథను పంపేటప్పుడు పత్రికలో ఉన్నట్టుగా కాలమ్స్‌గా విభజించి వ్రాయాలా?

అక్కరలేదు! కాలమ్సు, బొమ్మలు— అన్నీ పత్రికవారు చూసుకుంటారు. కాగితానికి ఒకపక్క, మార్జిను వదిలి వ్రాస్తే చాలు.

**ఎస్. పి, జగిత్యాల**

బ్రతకడానికి పనికి వచ్చే నిత్యావసర వస్తువులకు రేషను పెట్టడం కంటె దుబరా ఖర్చుకు దారితీసే ఫేషనుల రేషను అమలు పరచడం ఉత్తమం కదా?

క్యూలో నిలబడి కూటికుర పౌడరు ఎవరూ కొనుక్కోరు కాని బియ్యం కొనుక్కు తీరాలి. అందుకే వాటికే పెట్టారు.

**ఎమ్. ఎమ్, కరీంనగరు**

ప్రేమించడం అపరాధమా?

కూడని చోట — అపరాధమే మరి!

**ఎస్. టి. వి, మద్రాసు**

మన ఇంటిపని చాకిరీ అని భావించడం తప్పు కాదా?

తప్పే. ఇంటిపని చాకిరీగా భావించడం మొదలు పెడితే ఆ ఇల్లు త్వరలోనే నరకంగా [illegible] అవుతుంది.

**కె. బి. హెచ్, భీమవరం**

వచ్చిరాని స్వేచ్ఛతో నేటి స్త్రీ పురుషుణ్ణి తేలికపరుస్తూంటే పరిపూర్ణ స్వతంత్రం లభిస్తే అసలు పురుషునితో కాపరం చేస్తుందా అని సందేహం కల్గుతూంది

అసలు 'స్వేచ్ఛ' అనే మాటకి మీరిచ్చే అర్థం ఏమిటా అని నాకు సందేహం కల్గుతూంది!

**పి. ఏ. ఎస్. పి, హైదరాబాదు**

'కన్ను పొడుచుకున్నా కానరానంగా కటిక చీకటిలో' అంటూ ఏదేదో వ్రాస్తూ ఉంటారు కొందరు. కన్ను పొడుచుకొన్నాక ఇంక కనబడే దేమిటో!

అందుకేగా 'శూన్యంలోకి చూస్తూ' ఉంటారు?!

**సి. ఏ. ఎల్, వాల్తేరు**

స్త్రీ గొప్పా? పురుషుడు గొప్పా?

ఎవరూ గొప్పకాదు పరిపూర్ణ వ్యక్తిత్వానికి ఇద్దరూ—బొమ్మా బొరుసూ.

**బి. ఎల్, బరంపురం**

ఏదైనా కథను నాటక రూపంలో రూపొందించి ప్రదర్శించడానికి ఆ కథా రచయిత అనుమతి పొందాలా?

తప్పకుండాను. అది కనీస ధర్మం.

**జె. ఆర్, వరంగల్లు**

ఏమండీ, మానవుని జీవితానికి, జంతు జీవితానికి గల భేదం ఏమిటి?

నిజంగా నాకూ తెలియదు తమ్ముడూ.

# "జలుబును పోగొట్టుటకు నేను విక్స్ వేపొరబ్‌ను నమ్ముకొంటాను"

"ఈమధ్య మా అబ్బాయికి ఎక్కువ జలుబు చేసి సులువుగా ఊపిరితీసుకోలేక పోయేవాడు. నేను వానికి ఎన్నో రకాల మందులను వాడేను. కాని వాటివలన ఏమీ తగ్గలేదు. అప్పుడు, విదేశాలనుండి తిరిగి వచ్చిన మా డాక్టరుగారి చిన్న అబ్బాయి గోపాలం విక్స్ వేపొరబ్ సీసాను యిచ్చి దాన్ని వాడమన్నాడు. పాపం, అతను మా యింట్లోకి వచ్చి దానిని మా అబ్బాయి ముక్కుమీద, గొంతుకమీద, ఛాతీమీద ఎలా రుద్దాలో కూడ చెప్పేడు. మర్నాడు ఉదయానికి మా అబ్బాయి జలుబు పూర్తిగా పోయి, హాయిగా ఊపిరి పీల్చు కొంటూ లేచేడు.

ఆ అనుభవము తరువాత, జలుబును పోగొట్టుటకు విక్స్ వేపొరబ్ మహా మంచి మందని నేను నమ్ముకొంటున్నాను. నేను ఎల్లప్పుడూ ఒక విక్స్ వేపొరబ్ సీసాను అందుబాటులో ఉంచుకొంటాను."

5 గ్రాముల ఆకుపచ్చని డబ్బీలలో కూడ లభిస్తోంది.

వాడుటకు సూచనలు: విక్స్ వేపొరబ్‌ను వాడు పడుకోబోయేముందు రుద్దండి



దానిని వాని ముక్కుమీద, రెండు వైపులా రుద్దండి



... వాని గొంతుక మీద, ఛాతీమీద రుద్దండి



.. వాని వీపు అంతటి మీద రుద్దండి కంబళీ కప్పి పడుకోబెట్టండి

## "జలుబును పోగొట్టుటకు మీరూ విక్స్ వేపొరబ్‌ను నమ్ముకోండి"

## కొత్త సీరియల్ ప్రారంభం




**చైత్రమాసపు తొలి రోజులు. మధ్యాహ్నం ఒంటి గంట అవుతూంది.**

*మెయిన్ రోడ్డులో ఎక్కడా జనసంచారంలేదు. బస్సులు అటునించి ఒకటీ ఇటునించి ఒకటీగా, వస్తూపోతూ వున్నాయి.*

ఆ మెయిన్‌రోడ్డుకి, ఇటూ అటూ రెండు కంకర రోడ్డులు కలిసే చోట పెద్ద రావిచెట్టు ఒకటి వుంది. దాని క్రింద, రేకులతో చిన్న షెడ్డులా వేసుకుని, కిళ్లీ,షోడా కొట్టు పెట్టుకొన్నాడు గవర్రాజు.

ఆ కిళ్లీకొట్టు వెనకాతలనించి మొదలయ్యింది ఇళ్ల వరస. ఆ ఇళ్ల వరసలోని మొదటింటిలో, వుంటున్నారు. కామేశ్వరి వాళ్లూను.

ఆ ఇల్లు చిన్న బంగళా పెంకుటిల్లు. ముందు బాగా ఖాళీజాగా వదిలేసి, వెనకగా కట్టబడివుంది. ఆ ఇల్లు ఖాళీజాగాలోనికి ఎత్తయిన అరుగులు వున్నయ్. ఖాళీజాగా చుట్టూ, బార్బ్‌డ్‌వైర్‌తో, మధ్య మధ్య సిమెంటు స్తంభాలు నిల్చబెట్టి కట్టిన ఫెన్సింగ్ వుంది. లోపలికి వెళ్లే దారి ప్రక్కన రెండు వెదుళ్లు నిలబెట్టి, దానికి అడ్డంగా, ఒక నీలంరంగు బోర్డు కట్టబడివుంది. ఆ నీలంరంగు బోర్డు మీద తెల్లని అక్షరాలు పెయింటు చేసారు 'కవిరాజ ధన్వంతరీ నిలయం నరసయ్య— అని. దాని యజమాని నరసయ్యగారు. నరసయ్యగారికి, ఇద్దరు కూతుళ్లు పెద్దపిల్ల కామేశ్వరి, చిన్నది సుభద్ర. ఇద్దరు కొడుకులు, పెద్దవాడు చిట్టిబాబు కామేశ్వరి కన్న చిన్నవాడు సుభద్రకన్న పెద్దవాడు. ప్రీ యూని వర్సిటీ చదువుతున్నాడు. చిన్నవాడు జగ్గూ సెకండ్‌ఫారం చదువుతున్నాడు. తల్లి జగదాంబ. ఈ ఆరుగురూ, నరసయ్యగారి సంపాదనమీద జీవించాలి. కామేశ్వరికి ఇరవయిసంవత్సరాలుంటాయి. పెళ్లి చేయాలని, అయిదారేళ్లబట్టీ జగదాంబగారూ, నరసయ్యగారూ, తాపత్రయపడుతున్నారు.

ఆ ఎండవేళ కామేశ్వరి చెల్లెలు సుభద్ర అరుగుమీదకు వచ్చి నించుని నాలుగురోడ్లూ కలిసే వయిపు చూడసాగింది. అటూ ఇటూ నరమానవ సంచారం, ఏమాత్రం కన్పించలేదు ఆమెకి. దాహం వేస్తున్న కాకులు మటుకు, ఆ చెట్టుమీంచి, ఈ చెట్టు మీదకు ఈ చెట్టుమీదనుంచి ఆ చెట్టు మీదకు అప్పుడొకటి అప్పుడొకటి ఎగురుతున్నాయి. సుభద్ర కాస్సేపు అల్లా నిలబడగానే అయిదు క్షణాల్లో వేడెక్కిన సిమెంటు అరుగులు, ఆమె అరికాళ్లని చుర్రుమనిపించాయి. చటుక్కున లోపలికి వెళ్లిపోయింది.

'వస్తున్నారా?' హాలులో చాపమీద కూర్చున్న కామేశ్వరి అడిగింది.

'ఊహూ' అంది సుభద్ర.

ఈలోగా వంటింట్లోంచి, జగదాంబ వచ్చింది. ఆమె తల అంతా రేగిపోయి వుంది. ఆ రేగిన జుట్టు కొసలమీద తెల్లని మెత్తని బూడిద, అంటుకుని వుంది. ముఖానికి పట్టిన చెమటపల్ల ఆమె నుదుట వున్న గుండ్రని కుంకుమ కరిగి, ముక్కు చివరదాకా, పాకుతోంది. కళ్లనున్న కాటుక చెంపలదాకా, చీకిరి బాకిరిగా, అలమిపోయింది. అప్పటిదాకా ఆమె, పొయ్యివద్ద కూర్చునివచ్చిందని, ఆమెని చూడగానే చెప్పేయొచ్చును.

'అమ్మా! ఇకనన్నా కాస్త ముఖం కడుక్కొని బట్టలు మార్చుకోమ్మా! పొద్దుటినించి ఒకటే శ్రమపడుతున్నావు.' అంది కామేశ్వరి.

'అంతా అయిపోయింది. చిట్టిబాబూ, జగ్గూ వస్తారేమో అని చూస్తున్నాను. వాళ్లు గమ్మునవస్తే బాగుండును. అంది జగదాంబ.

'ఇంకే ఏమన్నా చేయాలా?' అంది సుభద్ర.

'చిట్టిబాబుని మైదా రవ్వ తెమ్మన్నాను. రవ్వలడ్డూ చేద్దామని. స్కూలునుంచి వొచ్చేటప్పుడు తెస్తానన్నాడు. జగ్గూ రాగానే నాలుగు కిళ్లీలు కట్టించుకు రమ్మని చెప్పు!' అన్నది జగదాంబ.

'ఇంకేం చేయొద్దు అమ్మా? నువ్వు బట్టలు మార్చేసి ముఖం అదీ కడుక్కో! రెండుగంటలు ఇట్టే అయిపోతుంది'. అంది కామేశ్వరి.

'స్వీట్ ఏదన్నా చేయకపోతే బాగుం

టుందా?' అన్నది జగదాంబ.

'ఇంకా స్వీటు చెయ్యాలంటూ, కూర్చుంటావేమిటి? ఉప్మా, బజ్జీ, వేసావు చాలదా? మన మేదో హోటలు పెట్టుకున్నట్లు, నాలుగు రకాలు చెయ్యటం ఆ వచ్చేవాళ్ళు, పీక మొయ్యాతిని, తర్వాత మొండిచెయ్యి చూపెట్టటంతప్ప లాభమేముంది? అసలు పూర్వపురోజుల్లో కతికితే అతకదని, పెళ్ళిచూపు లప్పుడు ఏమీ తినేవారుకాదట! ఇప్పుడేమిటి! ఏదో టీ పార్టీకి వచ్చినట్లు తినేస్తున్నారు!' అంది కామేశ్వరి.

'అయితే ఇంకేం చేయొద్దు అంటావా? నేనూ తయారవుతాను' అని లోపలికి వెళ్ళింది. జగదాంబ.

'అక్కయ్యా!' అంది సుభద్ర.

'ఏం?' అన్నట్లు తలెత్తింది కామేశ్వరి.

'అమ్మని ఇందాకట్నించి, బట్టలు మార్చుకోమని వేధిస్తున్నావు. ఇంతగీ పెళ్ళివారు ఎవర్ని చూస్తారు? నిన్నా అమ్మనా!' అంది చిలిపిగా సుభద్ర.

కామేశ్వరి, నిజంగా ఏమీ తయారు కాలేదు. చాపనిండ, పెన్సిలు, రబ్బరు, తెల్లకాయితాలు, కంపస్ బాక్సు, పెన్నూ, గాన కళాభోధిని, భారతి, అంధ్రపత్రికా, మున్నగునవి చిందర వందరగా వున్నాయి. తెల్లని మల్లు పరికిణీ, నీలం వాయిలు వోణీ, వేసుకునుంది. కామేశ్వరి పరికిణీ నిండా, సిరామరకలున్నాయి. గ్రాఫ్‌లో లెక్క చేస్తోంది. తల ఆత్తే రేగలేదు. కాని ముఖంనిండా చమట పోసింది. తెల్లని జాకెటు వంటికి అతుక్కుపోయి, లోపలనున్న, స్లీవ్‌లెస్ జుబ్బా కనపడుతూంది. కామేశ్వరి, కంపస్ బాక్సులో పెన్సిలూ, రబ్బరూ. పడేసి, కాయితాలూ పుస్తకాలూ సర్దుతూ,

'నేనేం తయారు కానక్కర్లేదు!' అంది కామేశ్వరి.

'ఇలాగే దర్శన మిస్తావా! అపర వాణీమూర్తి అనుకోవాలా!' అంది సుభద్ర.

'నేను ఎంత అలంకరించుకున్నా. దర్శనీయంగా వుండను! వచ్చే వాళ్ళకు, ఎలాగూ నచ్చను! ఇంక వృధా సింగారింపులో కాలం నేస్టు చెయ్యటమెందుకు? ఆ సింగారించుకునే కాలంలో నాలుగు లెఖ్ఖలు చేసుకుంటే పరీక్షలన్నా ప్యాసవుతానేమో!' అంది కామేశ్వరి.

'అదేమిటి అక్కా! కొంత మందికి నచ్చనంత మాత్రాన్న ఇంక ఎవరికి నచ్చవని రూఢి ఏమిటి? నువ్వు బాగా, అందంగా కనపడవని, నీకు నువ్వు అనుకుంటావు కాని, నాకు మటుకు, నీవు చక్కగా, అలంకరించుకుంటే, నీకేసే చూడాలనిపిస్తుంది! లే అక్కా! ఇవన్నీ. నేను సర్దుతాను. నీవు వెళ్ళి ముఖం రుద్దుకుని, బొట్టూ కాటుకా పెట్టుకో!' అని సుభద్ర, చాపమీద వున్న సామాన్లు అన్ని తీసి అలమారులోసర్ది చాపతీసి, ఆ హాలు వూడవటానికి ఉపక్రమించింది.

కామేశ్వరి, నల్లగా వుంటుంది. నలుపు అంటే మరీ కాటుకలా కాకపోయినా, చామనచాయకంటే కొంచెం తక్కువగా వుంటుంది. చెంపకు చారెడేసి కళ్ళు, ఒత్తుగా, ఒంకులు ఒంకులుగా, మడమల దాకా వుండే పొడుగాటి జత్తు, ఆ పిల్లకి పెట్టని ఆభరణాలు. ఇరవయి సంవత్సరాలు



పిండుతూన్నా కొంచెం సన్నపాటి శరీరం, అవటం నించి పదహారు పద్దెనిమిది సంవత్సరాల మధ్యనున్న బాలికలాగా చూపరులకు కన్పడుతుంది. సుభద్రకి పదిహేడు సంవత్సరాలుంటాయి పచ్చగా సన్నగా పొడుగ్గా చలాకీగా వుంటుంది సుభద్ర. సన్నటి కోలముఖం. ఆ లేత ముఖంలో దట్టమైన కాటుక గీతలా కన్పించే చీలిక కళ్ళూ, సన్నగా ఎత్తుగా నించునే ముక్కూ, చలించే గులాబీ రేకుల పెదాలూ, హుషారైన కన్నెలేడి! ఆ సుభద్రముందు, కామేశ్వరి, జీవితం అంతా కాచివడబోసి ఎసివాడిన విరాగిణిలా వుంటుంది.

సుభద్ర సిక్స్త్ఫారం చదువుతోంది. వంగి హాలు వూడుస్తూన్న సుభద్ర వెంపు చూసింది కామేశ్వరి. వంగినప్పుడు, సుభద్ర రెండు జడలూ, భుజం మీంచి క్రిందకు జారాయి. సుభద్రకి, కామేశ్వరి కున్నంత నిడుపాటి జుత్తు లేదు. పొట్టిగా జానెడుంటాయి వెంట్రుకలు. వంకులు మూలంగా రెండు జడలు వేసుకున్నా పొట్టిగా వున్నా ముద్దుగా వుంటాయి ఆ పిల్లజడలు! అరుగువానుకుని, సైకిలు ఆగిన చప్పుడుకి ఒక వురుకురికి సుభద్ర వీధి గుమ్మం దగ్గిరకి వెళ్ళింది. లేత

## పూహాడుముళ్ళూ

గులాబీరంగు జార్జెటు వోణీ ముదురాకు పచ్చని పట్టు పరికిణీతో సుభద్ర కన్పించే సరికి చిట్టిబాబు.

'అరరే!' అన్నాడు, అంటూనే సైకిలు వెనక్కి తిప్పి మళ్ళీ ఎక్కేసాడు. ముందు దిగిపోయిన జగ్గూ,

'మళ్ళీ ఎక్కడికిరా! నేనూ రావొద్దా!' అంటూ గునుస్తూన్నా విన్పించుకోలేదు

'ఏరా చిట్టీ మళ్ళీపోతున్నావ్!' అని కేకేసింది సుభద్ర.

'అమ్మ ఒకటి తెమ్మన్నది. మర్చిపోయేను. నిన్ను చూస్తే, జ్ఞాపకం వచ్చింది ' అంటూనే తుర్రుమని వెళ్ళిపోయేడు చిట్టిబాబు.

'ఇప్పుడింక అవసరం లేదురా'! అని సుభద్రకేక వేస్తూన్నా విన్పించుకో లేదు చిట్టిబాబు.

'చూడక్కా! అన్న నన్ను తీసుకో వెళ్ళటం లేదూ!' అంటూ పుస్తకాల సంచీ ఆ అరుగుమీద పడేసి చిందులు తొక్కటం మొదలు పెట్టాడు జగ్గూ.

జగ్గూ బొద్దుగా ముద్దుగావుంటాడు. పదేళ్ళుంటాయి. సుభద్ర తర్వాత చాలా కాలానికి జగ్గూ పుట్టాడు. ఇంట్లో వాడంటే అందరికీ ముద్దు! వాడికి సైకిలెక్కి తిరగటం సరదా! అంచేత రోజూ చిట్టిబాబు, తను కాలేజీనుంచి ఇంటికి వొచ్చేప్పుడు వాడి స్కూల్ దగ్గర ఆగి, వాణ్ని సైకి లెక్కించుకొని, తీసుక వస్తాడు.

'అన్నయ్య పనిమీద వెళ్ళాడు! అల్లా ఏడవకు! తప్పు! ఇవ్వాళ పెద్దక్కకి, పెళ్ళివారు వొస్తున్నారు. నీకూ చిన్నపని చెప్తాను చెయ్యాలి!' అంది సుభద్ర.

ఇంటికి చుట్టాలు వస్తున్నారనేసరికి చొక్కాతో ముక్కూ కళ్ళూ తుడుచుకుని పెద్దమనిషిలా నిలబడ్డాడు జగ్గూ.

'చూడు! గవర్రాజు దగ్గరకి వెళ్ళి నాలుగు కిళ్ళీలు కట్టించుకుని తెచ్చిపెట్టు! అంది సుభద్ర.

'మరి నాకు దాహం వేస్తోంది! ఒక సోడా తాగొద్దా!' అన్నాడు జగ్గూ.

'సోడా ఎందుకు! అమ్మ ఇవ్వాళ బోలెడు కాఫీ చేస్తోంది.' అంది సుభద్ర.

జగ్గూ ముఖం మంచి గుమ్మడి పూవల్లె విచ్చింది.

'నిజంగా, మనింట్లో కాఫీ చేస్తోందా అక్కా!' అన్నాడు ఆశగా జగ్గూ.

'మనింటికి చుట్టాలు వస్తారుగా మరి! అందుకని కాఫీ చేస్తోంది. మరి కిళ్ళీలు, గమ్మున తెచ్చిపెట్టు! చుట్టాలు, వావ్వారు కూడా వచ్చేస్తారు.' అంది సుభద్ర.

జగ్గూ సంతోషంగా అరుగుమీంచి ఒక్క ఉరుకు ఉరికాడు. కాలుజారి, బోర్లగిలా పడ్డాడు. మోచేయి చెక్కుకుపోయింది. ఒకప్పుడయితే రాగాలు తీసేవాడే! కాని ఈ రోజు ఏమీ కిక్కురుమనకుండా లేచి, చొక్కా దుమ్ము దులిపేసుకుని, 'గవర్రాజు' కిళ్ళీ కొట్టుకి పరుగెట్టాడు. కిళ్ళీషాపు దగ్గరవేసివున్న బెంచీమీద ఇద్దరు యువకులు కూర్చునివున్నారు. అందులో వకతను నల్లకళ్ళజోడు పెట్టుకున్నాడు. గవర్రాజు కిళ్ళీలు కడుతూ,

'దేనికి జగ్గూ! మీ ఇంటికి ఎవరన్నా చుట్టాలు వచ్చేరా?' అన్నాడు. జగ్గూకి ఎంతో సంతోషం కలిగింది. ఏమంటే సాధారణంగా గవర్రాజు, జగ్గూతో



మోస్తాడు. చిక్కాయింతే పరదాగా తూర్పోమని, హుషారుగా కబుర్లు చెప్తాడు. జగ్గూకి గవర్రాజు క్రాఫింగ్ బుట్టలా, ఎత్తుగా వుంటోంది గవర్రాజు అంటే మహా ఇష్టంగా వుంటుంది. జుట్టు! తెల్లని పల్చని, వాయిలు లాల్చీ



వేసుకుంటాడు ఎప్పుడూ గవర్రాజు! సాధారణంగా చారలున్న పైజామా కూడా వేసుకుంటూంటాడు. మెళ్లో వంటిపేట సన్నని బంగారు గొలుసు, దాని మధ్య పులిగోరు పతకం వుంది కొట్లో గాంధీజీ, నెహ్రూజీ నేతాజీల ఫోటోలు వున్నాయి. వాట్లకి కాగితం పూవులదండలు వేస్తాడు గవర్రాజు.

'మా ఇంటికి చుట్టాలు వస్తార్ట ఇవ్వాళ! మా సుబ్బక్క పట్టుపరికిణి కట్టుకుంది! మా అమ్మ కాఫీ కూడా చేస్తోంది!' గొప్పగా చెప్పాడు జగ్గూ.

బెంచీమీద కూర్చున్న ఇద్దరు యువకులూ, ఫక్కుమని నవ్వారు. జగ్గూ వాళ్లవెంపు ఉడుకుమోత్తనంగా చూసాడు. నల్ల కళ్లజోడు పెట్టుకున్న అబ్బాయి సిగరెట్టు కాలుస్తోన్న అబ్బాయితో

'ఇవ్వాళ వాళ్లింట్లో పెళ్లివారు వస్తున్నారట! ఏం, అబ్బాయి అంతేనా?' అన్నాడు అతనివయిపు చిక్కగా చూశాడు జగ్గూ. నల్ల కళ్లజోడు పెట్టుకున్న అబ్బాయి పచ్చగావుండి జగ్గూని ఆకర్షించేడు. సిగరెట్టు కాలుస్తోన్న అబ్బాయి ఎత్తుగా నల్లగా వున్నాడు.

'ఏం బాబూ! కోపంవచ్చిందా!' సిగరెట్టు కాలుస్తోన్న అబ్బాయి మృదువుగా అన్నాడు. లేదన్నట్లు తల అడ్డంగా వూపి, కిళ్లీలు తీసుకుని, ఇంటికి వెళ్లిపోయేడు జగ్గూ.

సుభద్ర హాలులో కొత్త జంబుఖానా పరిచింది. హాలులోంచి లోపలికి వెళ్లే గుమ్మానికి 'వెల్‌కం' అని ఎంబ్రాయిడరీ చేసిన కర్టెను వేసింది. హాలులో ఒకవయిపు డ్రాయరూ, దానిచుట్టూ నాలుగు కుర్చీలూ వేసింది. డ్రాయర్‌మీద కూడా ఎంబ్రాయిడరీ చేసిన టేబుల్ క్లాత్‌పరచి దానిమీద, చిన్నగా జు ఏనుగుబొమ్మ పెట్టింది. అది తొండం ఎత్తిపెట్టినట్లువుండి దానిమీద అగరువొత్తులు గుచ్చుకుందుకు వీలుగా చిల్లులున్నాయి. ఆ చిల్లుల్లో, అగరువత్తులు గుచ్చింది ఒకసారి హాలుమధ్య నిలబడి, తన సవరింపు బాగా వుందో లేదోనని చూసి, తృప్తిగా చిన్న నవ్వు నవ్వుకొంది. సుభద్ర. జగదాంబ కూడా, శుభ్రమయినపట్టుచీర కట్టుకుని, బొట్టూ కాటుకా పెట్టుకుని

సిగ పెట్టుకొని తయారయి పోయింది, కామేశ్వరిని—

‘రావే జడవేస్తాను’ అని పిలచింది.

‘అక్కే రేగలేదు జుత్తు!’ అంది కామేశ్వరి. తెల్లని వాయిల్ చీర, తెల్లని చోళీ ధరించింది కామేశ్వరి.

‘అదేం చీర కట్టుకున్నావు! పరికిణీ వోణీ వేసుకో లేకపోయేవా?’ అంది తల్లి.

‘వోణీలు వేసుకున్నంత మాత్రాన్న చిన్న పిల్ల ననుకుంటారా!’ అంది కామేశ్వరి,

‘అదికాదే! చీర కట్టుకుంటే పాతికేళ్ల దానిలా కన్పించుతావు! వోణీలు వేసుకుంటేనే చిన్నదాని లాగుంటావు! కాలు పొడుగుదానివి కదా!’ అంది తల్లి. కామేశ్వరి నిర్లిప్తంగా నవ్వుకొంది.

‘తను ఎల్లా అలంకరించుకుంటే పెళ్లికొడుకులకి ఆకర్షణీయంగా కనపడతుందో’ అని తల్లి ఆదుర్దా చెందుతోంది. అయిదారేళ్ల నించీ ఈ పెళ్లిచూపుల తతంగం జరుగుతోంది! అందరూ వస్తున్నారు, వెళ్లుతున్నారు. విందులు చేస్తున్నారు. కొందరికి తను నచ్చలేదు. కొందరికి తమ డబ్బు నచ్చలేదు! తనూ, తమ డబ్బు నచ్చిన పెళ్లివారు తమయింటి ఛాయల్లో లేరు! ఇంకా ఎన్నిరోజులు, ఇల్లా అలంకరించుకుని, పెళ్లిచూపులకి తయారవ్వాలో!’ అనుకొంది కామేశ్వరి

కామేశ్వరి, థర్డ్ఫారం చదువుతూండగానే పెద్దమనిషైంది. తామున్న పరిస్థితిలో పిల్లమరీ ఎదిగితే పెళ్లి చేయటం కష్టమని జడిసి, పెళ్లి సంబంధాలు చూస్తూ, చదువు మాన్పించేసింది జగదాంబ!

చదువయితే మాన్పించారు కాని, పెళ్లి సంబంధం మటుకు కుదరలేదు. ఈ లోపుగా, సుభద్ర కూడా ఎదిగిపోయింది. సుభద్ర ఎదిగాక ఇంకో చిక్కువచ్చిపడింది. కామేశ్వరిని చూసుకుందుకు వచ్చిన ప్రతీవాళ్లా, సుభద్రని చూసి, సుభద్రని ఇస్తే చేసుకుంటామనేవాళ్లు.

‘అదేల్లా? పెద్దమ్మాయికి అవకుండా చిన్న పిల్లకి పెళ్లిచేయచ్చా!’ అనేవారు వరసయ్య దంపతులు.

'అటు ఉంటే నీ పెద్దమ్మాయికి పెళ్ళి కుదరగానే మరి తెలియజేయండి, రెండు పెళ్ళిళ్ళూ ఒకమారే చేసెయ్యొచ్చును.' అనేవారు పెళ్ళివారు. ఇల్లా తర్జన భర్జనలు జరుగుతు వే కాలం గడిచిపో సాగింది. సుభద్ర ఫిఫ్తుఫారం ప్యాసయింది. చిట్టిబాబు యస్. యస్. యల్. సి. ప్యాసయి పి. యు. సి.లో జాయినయ్యాడు. కామేశ్వరికి తనుకూడా చదువుకుంటే బాగుండు ననిపించటం మొదలుపెట్టింది. అందులో ఈ మధ్య వచ్చే పెళ్ళి వారంతా—

## వరాడువముల్లో

'ఏం చదువుతోంది ? అనే ప్రశ్నలు వేయటం, థర్డ్‌ఫారం ప్యాసయింది— అనే జవాబు విని—

'స్ప బొత్తుగా, ఈ కాలం చదువు' అని పెదిమలు విరవటం కూడా జరుగు తోంది. దాదా దీనా పెళ్ళివారికి నచ్చాలంటే కూడా, కొంత విద్య అవసరం అని తెలిసింది కామేశ్వరికి. అందేత, మెట్రిక్ పుస్తకాలు తెప్పించుకుని, చిట్టిబాబువద్దా, సుభద్రవద్దా తెలియనివి చెప్పించుకుంటూ, చదువుకో సాగింది కామేశ్వరి వరసగా చదివేసుంటే ఈపాటికి బి. ఎ. ప్యాసయి వుండును కదా! అని విచారించేది కామేశ్వరి !

అటు పెళ్ళీ అవలేదు ఇటు చదువూ అవలేదు. చదువూ, పెళ్ళీ, రెండూ కూడా, కామేశ్వరికి ఆలస్యమయి పోయేయి! పెళ్ళికుదిరినప్పుడే చేయొచ్చును! అని చదివిస్తే, ఆ పిల్లకి చదువన్నా వచ్చును. కామేశ్వరి విషయంలో జరిగిన ఆలస్యం గుర్తించి, సుభద్రని, చదువు మాన్పించలేదు జగదాంబ! చీర మార్చుకోకుండానే మల్లెపూలు జడలో పెట్టుకుంటున్న కామేశ్వరిని చూసి నిట్టూర్చింది జగదాంబ !

* * *

జగ్గూకి అగివాళ్ళ మాడతోన్నా అరుగు వదిలి లోపలకిరా బుద్ధిపుట్టటం లేదు. దూరంగా విటమిటలాడే ఎండలో నురుగలు కక్కుతూ, వస్తోన్న గుర్రం బండీని చూడగానే, జగ్గూ మనస్సు సంతోషంతో ఉరకలు వేసింది

'అమ్మయ్య! చుట్టాలు వచ్చేస్తున్నారు! ఇంక అమ్మ, ఉప్మాకాఫీ ఇస్తుంది నాకి!' అనుకుంటూ వారిక ఎదురు చూస్తున్నాడు జగ్గూ. జగ్గూ అంచనా, తప్పవాలేదు ఆ గుర్రంబండీ సరాసరి వాళ్ళింటి వద్దకే వచ్చి ఆగింది. అందులోంచి, ఇద్దరు నడివయస్సు స్త్రీలు, ఒక మధ్య వయస్కుడూ, దిగారు. జట్కాబండి, ఆగిన చప్పుడువిని, జగదాంబ సుభద్ర, వీధిలోకి వొచ్చారు.

'రండి రండి! వొదినా! చాలా కాలానికి జ్ఞాపకాని కొచ్చేము.' అంటూ విస్మితురాలైన జగదాంబ వారిని ఆహ్వానించింది.

'ఒక రాచకార్యం మీద వొచ్చాము. మా నరసన్న వూళ్లో లేడేమిటి!' అంది వచ్చిన స్త్రీలలో కాస్త పెద్ద తరహాగా వున్న స్త్రీ. ఆమెపేరు సుందరమ్మ.

'వున్నారు. ఆయనా ఒక రాచకార్యం కోసమే తిరుగుతున్నారు. ఇంక వొస్తారు. వచ్చే వేళయింది.' అంటూ వాళ్ళని లోపలికి తీసుకువెళ్ళింది జగదాంబ. వచ్చినవాళ్ళే పెళ్ళివారనుకున్న కామేశ్వరి లోపలి గదిలోనికి వెళ్ళిపోయింది. పెళ్ళి



పశ్చిమ జర్మనీలోని మూడు నెలల పిల్లలకి ఈత నేర్పే కేంద్రంలో హెన్జ్ బుకో మిస్టర్ పసిపాపకి శిక్షణ యివ్వటం చిత్రంలో చూడవచ్చు.

కందుకు లేకుండా పెళ్ళిందుకు వచ్చారా అని ఆలోచిస్తూ సుభద్ర హాలులోనే నిలబడిపోయింది. వచ్చిన ఇద్దరు స్త్రీలలో రెండో ఆవిడ ఫాషన్‌గా నాజూగ్గా వుంది. ఆమెకేసి విస్ఫారితంగా చూసింది సుభద్ర.

'పెళ్ళికూతురు ఈ పిల్లేనా!' అంది ఆ యువతి. ఆమె పేరు వసుంధర.

సుందరమ్మ భళ్ళుమని నవ్వింది. గమ్మత్తుగా వుంది ఆమె నవ్వు.

'ఈ పిల్ల పెళ్ళికూతురయితే ఇన్ని రోజులు పెళ్ళికాకుండా వుంటుందా! పెద్దది ఉంకోర్తి వుంది. లోపలవుండి వుంటుంది!' అంది. సుందరమ్మ కూడా వచ్చినాయన, శివరామయ్య సుందరమ్మ భర్త! ఆయన హాలులో వున్న ఒకకుర్చీలో జారబడ్డాడు.

'ఈమె ఎవరు వొదినా?' రహస్యంగా సుందరమ్మని వంటింట్లోకి తీసుక వెళ్ళి అడిగింది జగదాంబ.

'మాతోటి కోడలు కూతుగితోటి కోడలు! వాళ్ళన్నయ్యకు పెళ్ళి సంబంధాలు చూడాలంటేనూ, లాక్కొచ్చాను. మన పిల్లలు ఇద్దరు వున్నారు కదా అని! ఎవర్నీ నచ్చితే, వాళ్ళ నిచ్చి ముడిపెట్టేయొచ్చు! పెద్దదానిక్కుదిరిందా! ఏదీ కనబడదేం!' అంది సుందరమ్మ సుందరమ్మ, నరసయ్య, అన్నతమ్ముల పిల్లలు. అయినా, స్వంత అన్నచెల్లెళ్ళ మాదిరి ప్రేమ గౌరవాలతో వుంటారు.

'అగదిలో వున్నట్లు వుంది పెద్దది! ఇంకా దానికే ఎక్కడా కుదరలేదు. ఇవ్వాళ ఎవళ్ళో చూట్టానికి వస్తారన్నారు మీ అన్న! ఏమిటో, వచ్చి చూట్టమేకాని, ఒక్కళ్ళకీ నచ్చటంలేదు! మా ఖర్మ ఏమిటోగాని!' దీనంగా అంది జగదాంబ.

'అంతా ఘటన! ఇంతకి దానికి ఏవూరు నీళ్ళ ప్రాప్తో!' అంది సుందరమ్మ.

ఇంతలో హాలులో కలకలం బయలు దేరింది. నరసయ్యగారి గొంతు వినపడింది

'ఇల్లా దయచెయ్యండి. ఇల్లాదయ చెయ్యండి! అబ్బో, బావగారూ! ఇల్లా దిగబడ్డారేమిటి! బహుకాల దర్శనం! మంచి సమయానికి వచ్చారు!' అంటూ హైరాను పడుతూ, నరసయ్య అందర్ని ఒకేసారి, పలకరించుతున్నాడు. అదే సమయానికి చిట్టిబాబు బిక్క మొహం వేసుకుని, చెమటలు కక్కుకుంటూ సైకిలుమీద ఇంటికి వచ్చేడు. అతనికి మైదారవ్వ బజారులో ఎక్కడా దొరక లేదు. రేషన్‌లో, పర్మిషన్ వున్న వాళ్ళకే ఇస్తారుట! గోధుమరవ్వ, శనగపప్పు బయట ఎంత డబ్బు ఇచ్చినా దొరకటం లేదుట! తల్లి ఉత్తచేతుల్తో వచ్చినందుకు ఏం అంటుందో అని భయపడుతూ వచ్చేడు చిట్టిబాబు. ఇంటికి వచ్చేసరికి ఇంటినిండా జనం గలగల్లాడుతూ తిరుగు తోంటం చూసిన చిట్టిబాబుకి ఇంకా కంగారెత్తి పోయింది తల్లి తనతో ప్రొద్దుటనగా చెప్పింది గోధుమ రవ్వ తెమ్మని. తాను నిర్లక్ష్యం చేసాడు. రవ్వ మధ్యాహ్నం దొరకలేదు ప్రొద్దుటే, రవ్వ దొరకని సంగతి తెలిపితే, తన తల్లి ఇంకేదయినా, టిఫిన్ తయారుచేసి వుంచును. ఇంకా తను రవ్వతెస్తాడు. ఉప్మా తయారుచేయొచ్చు అనుకో నుంటుంది! అది కాస్త దొరకలేదు.

ఇప్పుడు ఒకర్తె ఇంత మందినీ ఎల్లా సవరించ కలదు?

చిట్టిబాబుకి కంగారు ఎక్కువయిపోయింది. మరక్కడ నిలబడలేక అరుగు మీదకు వచ్చేడు! ఆవేదనతో అతని కళ్ళు చెమర్చాయి. జేబురుమాలుతో కళ్ళు తుడుచుకున్నాడు. జగ్గా కూడా నెమ్మదిగాఅన్న ప్రక్కకి వచ్చి నించున్నాడు. వాడికి చాలా ఆకలిగా వుంది. కాని అమ్మనానీ, అక్కలునాని వాళ్ని గుర్తించే పరిస్థితిలో లేరు! పైగా ఇందాక తన్ని వెక్కిరించిన, కళ్ళజోడు, సిగరెట్టు అబ్బాయిలని. ఘనంగా కుర్చీల్లో కూర్చో పెట్టి, రాజోపచారాలు చేస్తున్నారు.

## 18 క్లూలకు తెలుగు అనువాదం

1. నెహ్రూకు పిల్లలంటే ప్రీతి. ఆయన పిల్లలవలెనే అతి చురుకుగా / అతి జిజ్ఞాసుగా వుండేవాడు.
2. భారతదేశంగురించి అత్యంత సక్తిమైన / కుతూహలమైన యదార్థం ఏమనగా దాని భూమి అధిక సారవంతం, అందలి ప్రజలు నిరుపేదలు.
3. భారతదేశమందలి మనో విజ్ఞానానికి స్వయంగా దర్శన శాస్త్రం నుండి ప్రత్యేకించుటలో ఎప్పటికీ విశ్వాసం / సఫలత లేదు
4. అనాసక్తమైన దయా / పుణ్య కార్యములు లేక పరమార్థ పరిశ్రమ ఆత్మజ్ఞాన సాధనోద్యమంలోవలెనే ఆధ్యాత్మిక సాధనకు సహకరించును.
5. ధర్మ మరియు దర్శన సమ్మిళితమైన విజ్ఞానం, వాటిలో ఒకటిలేక రెండిటికంటే అత్యధిక స్పష్టతను / విశేషతను మరియు పొందికను గలిగియున్నది
6. సంపూర్ణ సత్యం నిజంగా అందరిలోను వాటు కొనియున్న యెడల గాని, దూషించే / ధ్యానించే వ్యక్తి యొక్క ఆత్మను అది బహిష్కరింపజాలదు
7. న్యాయ విధులు, అవే నిత్యమైనవి / సర్వవ్యాప్తమైనవి మరియు నిర్వికారమైనవి. వాటిని అభివ్యక్తీకరణంగా అనుసరించేది మన జ్ఞానమే
గ జీవితంలో విశ్వాసం/వికాసం అనంతత్వమును సాధించే మానవునికి ఒక సన్నిహిత మార్గం
9. తుది యథార్థము యొక్క ప్రభావం / విలువ నిత్య జీవితంలో సంబంధించి యున్న రాజకీయములకు అయుక్తమైనవి కానేరవు
10. మన స్నేహం / ఆరాధన మన కృతజ్ఞత మరియు ప్రేమ భావములకు ప్రబలనిదర్శనమై యుండవలెను
11. వదంతులు, ఐతిహాసిక/రాజకీయ యదార్థములలోనికి నిరూపించే ముందు కాచి వడియకట్టిన సత్యములుగా సిద్ధపరచ వలెను
12. శిక్షణ ధార్మిక వినయమును / ఐక్యతను కలిగించవలెను
13. విజ్ఞానం అత్యుగ్ర తరగతికి చెందిన ఆదర్శమైన / వాస్తవమైన విలువను అన్వేషించే ఉత్సాహ కార్యాచరణము
14 భారతదేశపు గ్రామీణ ప్రదేశం యొక్క దృక్పథంలో వైఖరి స్పష్టంగా / దృఢంగా సంప్రదాయాచరణయుతమైనది
15. నైతిక/సామాజిక మేలు యొక్క స్వభావమును నిశ్చయించుట అసాధ్యం కాకపోయినా దుర్లభం
16. దార్శనికుడు / గురువు మాయావి, మత గురువు, దైవాంశసంభూతుడు, వీరికుండదగి నట్టి కృత్రిమ గౌరవచిహ్నములను ధరించరాదు
17. దర్శన / ఆధ్యాత్మ సాధన యొక్క ముఖ్య ఉద్దేశం సత్యమును అనుభవసిద్ధికి తెచ్చుకొనుటయే. సత్యమును తెలుసుకొనుటకాదు గాని సత్యమును సిద్ధిపొందుటయే.
18. ఉద్దేశం / ధర్మం పట్ల సంశయము మానవ జాతి యొక్క ఇతిహాసమందు సర్వదశలలో సర్వదా ప్రత్యక్షం మరి భారతదేశం ఈ సందర్భంలో మినహాయింపుకాదు

## 18 CLUES

1. Nehru was fond of children and like children he was very **Active / Inquisitive**
2. The most **Arresting / Intriguing** fact about India is that her soil is rich and her people poor.
3 Psychology in India never **Believed / Succeeded** in getting itself separated from philosophy.
4 Disinterested works of **Charity / Piety**, or altruistic labour are as contributory to self-realization as spiritual effort.
5 Science inlaid with religion and philosophy has greater **Clarity / Variety** and harmony than any one or two of them
6 If the absolute truth should really comprehend all, it cannot exclude the self of the person that **Condemns / Contemplates** it.
7 The laws, themselves, are **Eternal / Universal** and immutable, it is only our knowledge that progressively approaches them.
8 **Faith / Growth** in life is man's finite way of approching the infinite.
9 The **Forces / Values** of ultimate reality cannot be valid for politics which is concerned with every day life
10 Our **Friendship / Worship** should be the evidence of our feelings of gratitude and love
11 Rumours must be distilled in the alembic of truth before they can be crystallised into **Historical / Political** facts.
12 Education must infuse religious **Humility / Unity**
13 Science itself is an activity seeking **Ideal / Real** values of the highest sort.
14 Rural India is **Markedly / Rootedly** conservative in its outlook.
15 It is difficult, if not impossible, to determine the nature of **Moral / Social** good
16 The **Philosopher / Preceptor** should not don the false plumes of the sh man, the priest or the prophet.
17 The main task of **Philosophy / Spirituality** is to have the realisation of reality, not to know the real but to be real
18 Suspicion of **Reason / Religion** has always been present at all stages in the history of the human race and India is no exception to this.

గమనిక : పై క్లూలు గ్రంథకర్తలు, రచయితల పుస్తకములనుండి తీసుకొనబడినవి అవి పూర్తి వాక్యములు మరియు వేరువేరుగా పూర్తి అర్థవంతమైనవి. గ్రంథకర్తలు రచయితల పేర్లు, వారి పుస్తకముల పేర్లు అఫిషియల్ సొల్యూషన్‌తోపాటు లిటర్క్విజ్ పిక్లో ప్రచురించబడును.

## పుహాడుపుంళ్లా

దాంతో జగ్గూకి ఆకలి మరింత జోరు అయ్యింది. అమ్మ దగ్గరగా వచ్చి—

'నీకు కాఫీ ఇచ్చిందా అమ్మ!' అన్నాడు.

'లేదు. నీకో!' అన్నాడు. చిట్టిబాబు.

'నాకు ఉప్మాయేనా పెట్టలేదు.' అన్నాడు. జగ్గూ,

'ఉప్మాచేసిందా అమ్మ!' అన్నాడు చిట్టిబాబు.

'న్నూ! బజ్జీలు చేసింది. ఏమీ పెట్టలేదు వాళ్లు ఎల్లా, బొక్కేస్తున్నారో చూడు! మనకు మిగులుతాయో లేదో!' కసిగా అన్నాడు జగ్గూ,

'తప్పు వెధవా!'' అన్నాడు చిట్టిబాబు.

'అమ్మయ్య! అమ్మ ఎల్లాగో అతిధులకి టిఫిన్ తయారు చేసిందన్న మాట! అనుకుని తృప్తిగా నిట్టూర్చాడు చిట్టిబాబు. అదే సమయంలో,

'ఎండలో నిలబడుతారేమర్రా! లోపలికి రండి!' అని శివరామయ్యగారు వాళ్లని కేకలేసారు. దానితో వాళ్ళుకూడా హాలు లోకి వచ్చారు. కామేశ్వరి గది కిటికీలో కూర్చుని పెరట్లోకి చూస్తూంది. పెరట్లో నూతిగట్టు దగ్గరగా వున్న దాచ వుసిరిచెట్టుమీద, బంగరు పిచ్చుక గూళ్ళున్నాయి. పచ్చని పసుపురంగు రెక్కలతోవున్న చిన్నచిన్న పిచ్చుకలు నూతిదగ్గర నీళ్లతోడుకునే చిన్న బాల్చీ చుట్టూచేరి కిచకిచ మంటూ ముక్కులతో పొడుచుకుంటూ కబుర్లు చెప్పుకుంటున్నాయి. వాటి స్నేహశీలతని ఉద్దేశంగా చూస్తూన్న కామేశ్వరి తను కూర్చున్న గదిలోనికి, వసుంధరా, సుందరమ్మ రావటం గమనించలేదు. వెనక్కి తిరిగున్న కామేశ్వరి వీపు మీంచి నున్నగా జారుతోన్న, బెత్తెడగొడ్డులాంటి జడ వసుంధరని మురిపించింది.

(ఇంకా ఉంది)

# క్రొత్త సంవత్సర కానుక

**LitQuiz No. 27**

**Rs. 32,500**

| FIRST PRIZE | RUNNERS-UP (UPTO 4 ERRORS) | MINIQUIZ (UPTO 2 ERRORS) | PRIZES IN BOOKS (A C +1 ERROR, MINIQUIZ A C.) |
|---|---|---|---|
| Rs 16,000 | Rs 10,000 | Rs 5,000 | Rs 500 |
| | RELIEF FUND Rs 1,000 | | |

ఆఖరు ముగింపు తేది: 18—1—68.
సొల్యూషన్ భారత్ జ్యోతిలో: 21–1–68.
ఫలితాలు భారత్ జ్యోతిలో: 8–2–68.

* సొల్యూషన్ వెంటనే పొందుటకు 6 పైసల స్టాంపు, స్వంత అడ్రసుగల కార్డును వెంటనే పంపవలెను *లిట్‌క్విజ్ ఫీక్లి 10సంచికలకు గ 2 పంపవలెను * మీ ఎంట్రీలను 17-1-68 బుధవారమునాడు కూడా పంపవచ్చును. కాని వాటిని ఎక్స్‌ప్రెస్ డెలివరీలో పంపవలెను.

## లిట్ క్విజ్ నెం. 27 అధికార ఎంట్రీ ఫారము

ADDRESS: LITQUIZ No. 27, ALANKAR, BALARAM STREET, BOMBAY-7 (W B)

గమనిక: (1) ఒక్కొక్క కాలంలో మీరు వద్దనే పదమును కొట్టి వేయండి (2) ఒక కూపన్‌మాత్రం పంపినచో ఇతర కూపనులను కొట్టి వేయండి (3) ఎంట్రీరుసుము M.O. ద్వారా పంపినచో, పోస్టాఫీసునుండిపొందిన M.O రసీదును ఎంట్రీ ఫారమునకు జతపరచవలెను. M O రసీదు లేని ఎంట్రీలు నిరాకరింపబడును. (4) I P O క్రాస్ చేయవద్దు. అది లిట్‌క్విజ్ నెం 27 బొంబాయి-7 వారికి చెల్లించునట్లు ఉండవలెను

| | 1 | Re 1 | 2 | Re 1 | 3 | Re. 1 | 4 | Re 1 |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | ACTIVE | INQUISITIVE | ACTIVE | INQUISITIVE | ACTIVE | INQUISITIVE | ACTIVE | INQUISITIVE |
| 2 | ARRESTING | INTRIGUING | ARRESTING | INTRIGUING | ARRESTING | INTRIGUING | ARRESTING | INTRIGUING |
| 3 | BELIEVED | SUCCEEDED | BELIEVED | SUCCEEDED | BELIEVED | SUCCEEDED | BELIEVED | SUCCEEDED |
| 4 | CHARITY | PIETY | CHARITY | PIETY | CHARITY | PIETY | CHARITY | PIETY |
| 5 | CLARITY | VARIETY | CLARITY | VARIETY | CLARITY | VARIETY | CLARITY | VARIETY |
| 6 | CONDEMNS | CONTEMPLATES | CONDEMNS | CONTEMPLATES | CONDEMNS | CONTEMPLATES | CONDEMNS | CONTEMPLATES |
| 7 | ETERNAL | UNIVERSAL | ETERNAL | UNIVERSAL | ETERNAL | UNIVERSAL | ETERNAL | UNIVERSAL |
| 8 | FAITH | GROWTH | FAITH | GROWTH | FAITH | GROWTH | FAITH | GROWTH |
| 9 | FORCES | VALUES | FORCES | VALUES | FORCES | VALUES | FORCES | VALUES |
| 10 | FRIENDSHIP | WORSHIP | FRIENDSHIP | WORSHIP | FRIENDSHIP | WORSHIP | FRIENDSHIP | WORSHIP |
| 11 | HISTORICAL | POLITICAL | HISTORICAL | POLITICAL | HISTORICAL | POLITICAL | HISTORICAL | POLITICAL |
| 12 | HUMILITY | UNITY | HUMILITY | UNITY | HUMILITY | UNITY | HUMILITY | UNITY |
| 13 | IDEAL | REAL | IDEAL | REAL | IDEAL | REAL | IDEAL | REAL |
| 14 | MARKEDLY | ROOTEDLY | MARKEDLY | ROOTEDLY | MARKEDLY | ROOTEDLY | MARKEDLY | ROOTEDLY |
| 15 | MORAL | SOCIAL | MORAL | SOCIAL | MORAL | SOCIAL | MORAL | SOCIAL |
| 16 | PHILOSOPHER | PRECEPTOR | PHILOSOPHER | PRECEPTOR | PHILOSOPHER | PRECEPTOR | PHILOSOPHER | PRECEPTOR |
| 17 | PHILOSOPHY | SPIRITUALITY | PHILOSOPHY | SPIRITUALITY | PHILOSOPHY | SPIRITUALITY | PHILOSOPHY | SPIRITUALITY |
| 18 | REASON | RELIGION | REASON | RELIGION | REASON | RELIGION | REASON | RELIGION |

SEND THESE 2 COUPONS & ENTER MINIQUIZ FREE 27 SEND THESE 2 COUPONS & ENTER MINIQUIZ FREE

**MINIQUIZ** — 12 CLUES FREE COUPON 1

| ACTIVE | INQUISITIVE | FAITH | GROWTH |
|---|---|---|---|
| ARRESTING | INTRIGUING | FORCES | VALUES |
| BELIEVED | SUCCEEDED | FRIENDSHIP | WORSHIP |
| CHARITY | PIETY | HISTORICAL | POLITICAL |
| CLARITY | VARIETY | IDEAL | REAL |
| ETERNAL | UNIVERSAL | MORAL | SOCIAL |

**MINIQUIZ** — 12 CLUES FREE COUPON 2

| ACTIVE | INQUISITIVE | FAITH | GROWTH |
|---|---|---|---|
| ARRESTING | INTRIGUING | FORCES | VALUES |
| BELIEVED | SUCCEEDED | FRIENDSHIP | WORSHIP |
| CHARITY | PIETY | HISTORICAL | POLITICAL |
| CLARITY | VARIETY | IDEAL | REAL |
| ETERNAL | UNIVERSAL | MORAL | SOCIAL |

**27** (ASVP)

ఈ క్విజ్ ప్రవేశమునకు చెందిన నిబంధనలను షరతులను పాటించుటకు అంగీకరిస్తున్నాను. పోటీ ఫలితాలపై ఎడిటరు గారి నిర్ణయమును తుది నిర్ణయముగాను, న్యాయబద్ధమైనదిగాను అంగీకరించుటకు ఆమోదిస్తున్నాను ప్రతి కూపనుకు ఎంట్రీ ఫీజు రు. 1/-. ఈ పూర్తి ఎంట్రీ ఫారము (4 కూపనులకు) ఫీజు రు. 4/-. M. O. రసీదు/I.P.O./లిట్‌క్విజ్ క్యాష్ రసీదు/ప్రైజు కార్డు జతపరుస్తున్నాను. వాటి వెల............

CAPITAL LETTERS

NAME ..............................................................

ADDRESS ..............................................................

..............................................................

ఈ పూర్తి ఫారమును కత్తిరించి పంపవలెను

# శృతి మించిన అపశృతి

యర్రంశెట్టి వరలక్ష్మి




'నేను కాలేజీలో చేరుతున్నాను...'

రాజారావు వంక చూస్తూ ఉత్సాహంగా అంది ఇందిర.

రాజారావు ఉలిక్కి పడ్డాడు. దెబ్బ తిన్నట్లు ఆమె వంక చూశాడు.

ఇందిర అదేమీ గమనించలేదు.

'నాన్నగారు వప్పుకొన్నారు...సాయంత్రం నిన్నోసారి రమ్మన్నారు కూడా. నాకంతా కొత్త కదా! నువ్వే నన్ను తీసుకెళ్ళి చేర్పించాలి...'

రాజారావుకి కలవరం పుట్టుకొస్తోంది. దిగాల్గా కిటికీలోనుంచి బయటకు చూడసాగాడు.

'రోజూ మనిద్దరం చక్కగా కలిసి కాలేజీకి పోవచ్చుకదూ...'

'సరేలే!...కాసేపు నన్ను రికార్డ్ వ్రాసుకోనీ! తర్వాత మాట్లాడుకొందాం.'

విసుగ్గా అనేసి ఏదో పుస్తకం తీసి వ్రాయడానికి సంసిద్ధుడయ్యాడు రాజారావు.

అతని విసుగుచూసి ఇందిర కొద్దిగా నిరుత్సాహ పడింది.

'సరే ... వ్రాసుకో ... సాయింత్రం మాట్లాడదాంలే మనం...గ్రూప్ ఏం తీసుకోవాలో కూడా నువ్వే చెప్పాలి మరి!...'

రాజారావు ఏమీ మాట్లాడలేదు. తల వంచుకొని ఆమెమాటలేమీ విననట్లే నటించాడు.

ఇందిర మెల్లగా బయటకు వెళ్ళి పోయింది.

ఆమె వెళ్ళిపోయిం తర్వాత రాజారావు రెండు చేతుల్తోనూ తలపట్టుకొని కూర్చుండి పోయాడు!

'ఇందిర కాలేజీలో చేరుతుంది. కాలేజీలో ముందుగా తనే ఆమెనుంచి తప్పించుకు తిరగాలి. కాలేజీ ఆవరణలో గాని, రోడ్డుమీదగాని తనతో మాట్లాడొద్దని ఖచ్చితంగా చెప్పెయ్యాలి. లేకపోతే తనని కూడా అందరూ ఆటలు పట్టిం చేస్తారు. అసలు మొదట్నుంచే ఆమెకు దూరంగా వుంటే బావుండేది. ఇందిర

వాళ్ళు తమ ప్రక్కనున్న ఇంట్లో అద్దెకు దిగి నాలుగయిదేళ్ళు అవుతుందేమో! ఇందిరతో ఆ చుట్టుప్రక్కల పిల్లలెవ్వరూ స్నేహం చేసే వాళ్ళుకాదు. ఒకరిద్దరు ఆడపిల్లలు తప్పితే మరెవ్వరూ ఆమెని దగ్గరకు చేరనీరు. మొహమాటం కొద్దీ తను ఇందిరతో మాట్లాడక తప్పటం లేదు. అంచేతే ఇందిరకి తనంటే అభిమానం. ఏ విషయమయినా ముందుగా తనతోనే చెబుతుంది. ఇంతకీ భగవంతుడు ఇందిర నెందుకు ఇంత కురూపిగా సృష్టించాడో. ఆమె మొఖంవంక చూస్తూ ఓ నిమషం కూడా మాట్లాడ బుద్ధికాదు.

ఆ సాయంత్రం రాజారావు కోసం అతని ఇంట్లో ప్రవేశించింది ఇందిర.

'వాడలా బజారు వేపు వెళ్ళాడమ్మా!' అంది రాజారావు తల్లి.

ఇందిర నీరు కారిపోయింది.

'సాయంత్రం రాజారావుని పిలుచుకొస్తానన్నా ..మీరు మాట్లాడండి!' అని చెప్పింది తను తండ్రితో. తన కాలేజీ చదువు గురించి కొన్ని వివరాలు తెలుసుకోవాలనుకొన్నారాయన. కాలేజీలో చేరడానికి తనెంతో గొడవ చేస్తేనేగాని ఒప్పుకోలేదాయన. మెల్లగా వెనక్కు తిరిగి తన ఇంట్లోకి నడిచిందామె.

'రాజారావ్ ఏదో పనిమీద బజారు కెళ్ళాట్టనాన్నా...వచ్చాక పిలుచుకొస్తాను' అంది తండ్రితో...

ఆయన సంగతి గ్రహించుకొని లోలోపలే బాధ పడ్డాడు.

'అవును! ఇంత వికృతంగా ఉన్న ఆడపిల్లతో మాట్లాడ్డానికి ఎవరికి మనసొప్పుతుంది? నువ్వా ఓ యువకుడివే రాజారావ్... నీది తప్పులేదు. ఒకోసారి అర్థంలేని పనులు చేసే భగవంతుణ్ణను కోవాలి ..అంతే!' అనుకొన్నారాయన.

'పోనీలేమ్మా ... వచ్చాకె మాట్లాడదాంలే!'

రాత్రి రాజారావు భోజనం చేస్తూంటే ఇందిర వచ్చి గడపలో నుంచుంది.

'ఏయ్...సాయంత్రం ఉంటానని వెళ్ళిపోయావ్ కదూ?'

'మర్చిపోయానిందిరా...ఆ సంగతి గుర్తేలేదు నాకు...' అన్నాడు రాజారావ్.

'అవును ... నే చెప్పేవేవీ నీకు గుర్తుండవ్...' అంది కోపంగా.

'ఛఛ! అదేంకాదు...కాసేపుండు వస్తున్నాను...'

రాజారావు ఇందిర ఇంటికెళ్ళేసరికి అప్పుడే థర్మామీటరు చూస్తున్నారాయన.

'ఇంకా జ్వరం తగ్గలేదాండీ!' అడిగాడు రాజారావు.

'ఫరవాలేదు...ఇవాళ నార్మల్‌కి వచ్చేసింది...' అన్నారాయన.

కాసేపాగి 'నువ్వో చిన్న సహాయం చెయ్యాలి బాబూ...ఇందిర కాలేజీలో చేరతానని గొడవ చేస్తోంది. నేను లేవలేని స్థితిలో వున్నాను. కాస్త నువ్వే అమ్మాయిని తీసుకుపోయి చేర్పించాలి...'

'అలాగేనండీ.. రేపే చేర్పిద్దాము...' అన్నాడు రాజారావు.

'అమ్మాయ్...కొంచెం మంచినీళ్ళు తేమ్మా..' అడిగారాయన.

ఇందిర లోపలికి వెళ్ళింది.

'బాబూ! రాజా...ఇందుని అభిమానించే స్నేహితులెవరూ లేరు. అందుక్కారణం నీకు తెలుసు నేను నిన్ను కోరేది ఒక్కటే. దానినెప్పుడూ అసహ్యించుకోకు. కనీసం దానికలా అనిపించనీయవద్దు...దానికి నీమీద అంత అభిమానం వుంది...' తరువాత మాట్లాడలేకపోయాడాయన.

ఇందిర మంచినీళ్ళు తీసుకువచ్చింది.

మరి కొంచెంసేపవీ ఇవీ మాట్లాడిం తరువాత రాజారావు ఇంటి కొచ్చేడు అతని వెనుకే ఇందిర కూడా వచ్చింది

'రేపెన్నింటికి వెళ్ళాలి మనం?' అంది ఉత్సాహంగా.

'తొమ్మిదింటికల్లా బయల్దేరాలి...' ముక్తసరిగా జవాబిచ్చాడు రాజారావు.

'సరే నేను రడీగా వుంటాను... ఓ వేళ నన్ను మళ్ళీ మర్చిపోయి వెళ్ళిపోవు గదా?..'

'ఛవ్! మరీ అంత మతిమరుపనుకొన్నావేమిటి?..'

చిన్నగా నవ్వి వెళ్ళిపోయింది ఇందిర.

ఆ రాత్రి చాలాసేపటివరకూ రాజారావుకి నిద్రపట్టలేదు.

'ఇందిరని తనవెంబడి తీసుకవెళ్తే, అందరూ తమిద్దరినే చిత్రంగా చూస్తారు. తన క్లాస్‌మేట్సు గొడవ చేసినా చేసేస్తారు. ఆ 'రంభ' ఎక్కడ దొరికిందిరా అని ఎగతాళి చేస్తారు... అంచేత ఇందిర నొక్కర్తినే ముందువెళ్ళి ప్రిన్సిపాల్ గదిదగ్గర నుంచోమన్జెప్పాలి. అక్కడ తను కలుసుకొని ఇంటర్వ్యూ అయింతరువాత మళ్ళీ ఆమెను తప్పించుకుపోవచ్చు.

ప్రొద్దున్న ఎనిమిదిన్నరకల్లా ఇందిర తయారయిపోయి రాజారావు దగ్గర కొచ్చింది.

'చూశావా? నువ్వు తొమ్మిదంటే, నేను ఎనిమిదిన్నరకే రడీ అయిపోయాను!' అంది నవ్వుతూ.

రాజారావు ఆమెవంక పరీక్షగా చూశాడు.

'నీలంరంగు పరికిణీ, దానిమీద తెల్లని పువ్వుల ఓణి వేసుకొంది. నీలంజాకెట్టు ఇవన్నీ ఆమె యవ్వనాన్ని చాటుతోన్నాయి కాని, అందాన్నివ్వలేకపోతున్నాయి. మరింక చూడబుద్ధికాక తల దించుకొన్నాడతను.

'ఇందిరా ఓ చిన్నపని చేస్తావూ?'

'ఏమిటదీ?' విస్మయంగా చూసిందామె.

'నీకు కాలేజీ తెలుసు కదా? వెళ్ళిపోయి ప్రిన్సిపాల్ గదిదగ్గర నుంచో! నేను ఓ అరగంటలో సైకిల్‌మీద వచ్చేస్తాను. ఏం?'

ఇందిర మూరాం చేసింది

'ఊ ఎందుకేం?. నాకసలే కొత్త... నాతో రాకూడదేమిటి నువ్వు '

'ఊహు' అదికాదు. మా స్నేహితుడింట్లో చిన్న పనుంది.. వెళ్ళి అలా వచ్చేస్తాను ప్లీజ్ '

ఇందిర అతని మొఖంలోకి ఓ క్షణం చూసి 'సరే నేను అక్కడే నీకోసం.. ఎదురు చూస్తుంటాను మర్చిపోకేం?' అంటూ వెళ్ళిపోయింది

రాజారావు హాయిగా గాలి పీల్చుకొన్నాడు. మరి కాసేపటిలో ఇందిర వెళ్తున్నానే అమ్మా!' అనడం వినిపించిందతనికి.

అతను కాలేజీకి చేరుకొనేసరికి ఇందిర అప్పటికే అరగంటనుంచీ అతనికోసం ఎదురు చూస్తోంది ఆమె ప్రక్కనే నలుగురు ఆడపిల్లలు నుంచొని నవ్వుతూ ఏదో మాట్లాడుకొంటున్నారు. చిక్కు

# శ్రుతిమించిన అపశ్రుతి

విక్కుతూ మంటూ అందరివంకా చూస్తున్న ఇందిరకి రాజారావుని చూడటంతోనే ప్రాణం లేచి వచ్చినట్లయింది.

'రాజూ...' అంటూ బిగ్గరగా పిలచింది.

ఆడపిల్లలు మాట్లాడ్డం తక్కున ఆపేసి రాజారావు వంక తిరిగి చూశారు. రాజారావు చాలా సిగ్గుపడిపోయాడు. ఇందిర వంక కోపంగా చూసి వూరుకొన్నాడు. మరికాసేపటికి ఫీజు కట్టేసిం తర్వాత ఇద్దరూ కాలేజీ బయటకొచ్చారు

'ఈవారమంతా నువ్వు కాలేజీకి రానక్కర్లేదు ... క్లాసులు జరగవు!' అన్నాడు రాజారావు.

'సరే!...నా కేవేం పుస్తకాలు కావాలో నువ్వే కొనుక్కురా...'

'అవన్నీ నేను చూసుకొంటాలే. నువ్వింటికి వెళ్ళిపో.. నేను క్లాసుకి వెళ్తాను...' అనేసి వడివడిగా వెళ్ళిపోయాడు.

నెలరోజులు గడిచినయి. ఈ నెలరోజుల్లోనూ ఇందిర మానసికంగా చాలా కృంగిపోయింది. క్లాసులోని ఆడపిల్లలందరూ ఆమెను వెలివేసినట్లు చూడ్డం మొదలెట్టారు. 'శూర్పణఖ' అని కొంతమంది కుర్రాళ్ళు ఆమెకు పెట్టినపేరు కాలేజి అంతా ప్రాకిపోయింది. క్లాసులో ఇందిర కూర్చునే బెంచి మీద మిగతా ఆడపిల్లలు కూర్చునే వారుకాదు. ప్రతి రోజూ పాఠం జరుగుతూండగా ఆమె మీదకు కాగితపు వుండలు, బాణాలు వచ్చి పడుతుండేవి.

కొంతమంది లెక్చరర్లు కూడా ఆమెను ఏదోరకంగా అవమానానికి గురిచేస్తూండే వారు.రాను రాను ఆమెలోని ఓర్పు సన్నగిల్లిపోయింది. ఒకోరోజు కాలేజీకి కూడా వెళ్ళకుండా ఇంట్లో కూచుని ఏడుస్తూండేది. తల్లీ తండ్రీ తప్పితే ఇందిర మనసు విప్పి మాట్లాడేది ఒక్క రాజారావుతోనే. రాజారావంటే ఆమె అంత అభిమానంగా వుండటానికి కారణం తన మాటలను అతను అసహ్యించుకోకుండా హేళన చెయ్యకుండా వినడమే. అంతకంటే ఇందిర రాజారావు నుంచి ఎక్కువేమీ ఆశించలేదు. మనసులోని బాధంతా అతనితో చెప్పాలని అనేకసార్లు అనుకొంది. కాని చెప్పేస్తే, అతను గూడా అందరిలా చూస్తాడేమోనని భయం చేత ఊరుకుండి పోయింది.

ఆరోజు ఇందిర కాలేజికి వెళ్ళేసరికి అప్పుడే సెకండ్ బెల్ అవుతోంది. గర్ల్స్ వైటింగ్ రూమ్‌లోకి వెళ్తూ లోపలి మాటలు విని అక్కడే ఆగిపోయింది.

'ఏయ్ సరూ! శూర్పణఖ ఇంకా రాలేదేం?' అంది పద్మ.

'ఛ! ఇప్పుడే దాన్ని తల్చుకోడవెందుకే... క్లాసులో ఎలాగో దాని పాడుమొఖం చూస్తూ కూర్చోక తప్పదుగా...' సరోజ జవాబు.

ఫక్కున నవ్వులు.

'ఛ...ఛ...దాని అవతారానికితోడు 'మేనర్స్'కూడ తెలీదే...అన్నీ వెకిలి చేష్టలు...' అంది లక్ష్మి...

ఇందిరకి ఏడుపొచ్చేసింది. తమాయించుకొని లోపలికి నడిచింది.

ఆమెను చూడగానే అందరూ మరేవో విషయాల గురించి మాట్లాడుకోసాగారు. ఆమె సరాసరి పద్మదగ్గరకెళ్ళి ఆగింది.

'పద్మా!...ఎందుకు...నేనంటే మీకంత కోపం?. నేను అందంగా లేకపోతే అది నా తప్పా? .నేను కావాలని వికృతంగా పుట్టానా?. .దీనికి నేనేం చేయను .. ఎందుకు మీరందరూ నన్నువెలేసినట్లు చూస్తారు ... నన్నెందుకిలా హింపిస్తారు?...' అనేసి చేతుల్లో మొఖం దాచుకొని వెక్కి వెక్కి ఏడవ సాగింది. ఆమెచేతిలోని పుస్తకాలు క్రిందే పడిపోయినయి. అంతా నిశ్శబ్దమయిపోయింది.

ఆమె దుఃఖంనుంచి తేరుకొనేప్పటికి థర్డ్ బెల్ అయిపోయింది. రూములో ఎవ్వరూ లేరు. క్రిందపడిన పుస్తకాలన్నీ ఏరి పట్టుకొని బయటకు నడిచింది. అప్పుడు క్లాసులోకెళ్తే జరిగేదేమిటో ఇందిరకు బాగా తెలుసు. ఇంగ్లీష్ లెక్చరరు గారు తనని చూడనట్లే నటించి తలుపు దగ్గర పదినిమషాలు నుంచుండ బెడతాడు. అందరికళ్ళూ తనవంకే చూస్తుంటాయి. లోపలికి నడుస్తుంటే ఎవరో ఏదో అంటారు. అందరూ గొల్లున నవ్వుతారు. తనొక్కర్తే ఓ ఖాళీ బెంచిమీద కూర్చోవాలి... ఎటు చూచినా తనొక్కర్తే. తనకి ఎవ్వరూ లేరు...

'అప్పుడే వచ్చేశావేం?' అడిగింది



## శృతిమించిన అపశృతి

'క్లాసుకెళ్ళవు!' అప్రయత్నంగా అబద్ధం మాడేసింది ఇందిర. పుస్తకాలు టేబుల్ మీద విసిరేసి తన మంచంమీద వంగిపోయింది.

ఆవేళ సాయంత్రం రాజారావు కాలేజి నుంచి ఇంటికొచ్చేసరికి బాగా ప్రొద్దు గూకిపోయింది.

తన గదిలోకి నడిచి లోపలకూర్చుని ఉన్న ఇందిరనిచూసి ఆశ్చర్యపోయాడతను

'ఏమిటిక్కడ కూర్చున్నావ్?' అన్నాడు చిత్రంగాచూస్తూ.

'నీకోసం...చూస్తున్నాను...' అంది తల వంచుకొని.

'మళ్ళీ...ఏమిటి?..' అన్నాడు కోపంగా ఆమెవంకేచూస్తూ.

ఆమెకళ్ళు ఎర్రగావున్నాయి. మొఖం [illegible] వుంది. జుట్టు రేగింది.

క్షణం అతనివంకే చూసి దగ్గరగా వచ్చేసింది ఇందిర.

రాజారావ్ తెల్లబోయాడు.

'ఇందిరా ఎందుకేడుస్తున్నావ్.ఏమయింది?' అన్నాడు భయంగా.

ఇందిర జవాబివ్వలేదు లేచి నుంచొని [illegible] మొఖం దాచుకొని ఏడవసాగింది.

రాజారావు ఆమెదగ్గరగా నడిచాడు.

'ఇందిరా! చెప్పు [illegible] జరిగింది?'

ఆమె జవాబియ్యలేదు.

ఆమె రెండుభుజాలు పట్టుకొని తన వేపు త్రిప్పుకొన్నాడతను.

'ఇందూ ... అలా ఏడవకు? . ప్లీజ్ చెప్పవూ .ఏమయిందీ?...ఎవరయినా గొడవ చేశారా?'

ఇందిర తలెత్తి అతనివంక చూసింది. దుఃఖం మరింతగా వచ్చింది.

'రాజా!. ' అంటూ అతనిహృదయం మీదికి వరిగిపోయింది.

'నేనింక కాలేజికి వెళ్ళను రాజా.. అక్కడ ఎవ్వరూ నాతోమాట్లాడరు. ఆఖరికి మా క్లాసు అమ్మాయిలుకూడా... అందరికీ నేనంటే అసహ్యం.. నేను కూర్చునే బెంచిమీద ఎవ్వరూ కూర్చోరు .. నామీద కాగితాలు విసురుతారు...అందరూ నన్ను 'శూర్పణఖ' అని పిలుస్తారు. [illegible]...నేను...ఏజబ్బయినా వచ్చి చచ్చిపోతే బావుండుననిపిస్తోంది.

నయి. ఇందిరమీద విపరీతమయిన జాలి కలిగిందతనికి.

'అందరూ అసహ్యించుకొంటే ఇందిర గతేం కావాలి, అందరితో కలసి వుండాలనీ, అందరిలా సరదాగా జీవితం గడపాలనీ ఆ అమ్మాయికీ కోరికలుండవూ? . కురూపిగా పుట్టటం ఇందిర తప్పా... మరి శిక్ష ఈమెకెందుకు?. '

ఇందిరని గాఢంగా హృదయానికి హత్తుకొన్నాడతను.

'ఇందిరా. .ఏడవకమ్మా!.. ఎవరేన్నన్నా నువ్వేం పట్టించుకోవద్దు. ఎవ్వరూ మాట్లాడకపోతే నీకేం?. నేను లేనూ?... మనిద్దరం చక్కగా మాట్లాడుకొందాం .. [illegible] ఎవ్వరేమన్నా అసలు వినొద్దు. [illegible] [illegible] వెళ్ళకపోతే క్లాసులో [illegible] నేను చెప్తాను. .ఏం? తెల్సిందా?...'

ఇందిర కళ్ళు ఆనందంతో మెరసినయి అతని నుంచి దూరంగా జరిగి ఓణీతో కన్నీళ్ళు తుడుచుకొంటూ నిలబడింది. కొంచెం సేపాగి 'నేను ... వెళ్తాను. ' అంటూ వెళ్ళిపోయింది. ఈ సంఘటన తరువాత ఆమె హృదయం తేలిక పడింది. చాలా రోజుల తరువాత హాయిగా నిద్రపోయింది ఇందిర ఆ రోజు.

తర్వాత ఇందిర క్లాసులోని కుర్రాళ్ళ వెక్కిరింపులు పట్టించుకోడం మానేసింది. ఆ రోజునుంచి ఆమె రాజారావు మీద విపరీతమయిన అభిమానం పెంచుకొంది. ఆమె దృష్టిలో రాజారావు దేముడు. ప్రతిరోజు సాయంత్రం కాసేపయినా అతనితో మాట్లాడకపోతే పిచ్చెక్కినట్లు వుంటుంది.

ఆ రోజు నుంచి రాజారావు ఇందిరని అదివరలా అసహ్యించుకోడం మానేశాడు. పాపం! తనూ నిర్లక్ష్యం చేస్తే ఇందిరకి జీవితం మీదే విరక్తి పుడుతుంది.. తనని తనే అసహ్యించుకోడం మొదలెడుతుంది.. ఆ తరువాత ఏం జరిగినా ఆశ్చర్యపడ నవసరంలేదు.

వారం రోజులు గడచినయి. ఆ రోజు రాజారావుకళ్ళ [illegible] రాజారావు కాలేజీ ఆవరణలో కొచ్చేసరికి అతని క్లాస్‌మేటు రమణ కనబడ్డాడు.

ఇద్దరూ కలసి నడవడం సాగించేరు. ఉన్నట్లుండి రమణ గట్టిగా అరచేడు.

'గురో! శూర్పణఖ వస్తోంది...'

రాజారావు గుండెలు ఝల్లు మన్నాయి. తలెత్తి చూచాడు. ఎదురుగా ఇందిర వస్తోంది. అప్పుడే వీళ్ళిద్దరినీ ఆశ్చర్యంగా చూస్తోంది. రాజారావు రమణని మందలించాలనుకొన్నాడు కాని ఏదో బలహీనత అతన్ని మాట్లాడనీయలేదు.

'మన జూనియర్స్ పెట్టారుగురో... దీనికా పేరు.. చాలా సూటబుల్ నేమ్ సెలక్టు చేశారు కదూ?...'

రాజారావు తల వంచేసు కొన్నాడు. ఇందిర ఆ మాటలన్నీ వినుంటుంది తనే రమణతో అలా అనిపిస్తున్నాడనుకొంటుందేమో! ఇంటికి వెళ్ళిపోయి ఏడుస్తూ కూచుంటుంది... ఇప్పుడు ఇందిరకి చెప్పకోడానికూడా ఎవ్వరూ లేరు.. దీనికంతా కారణం రమణ. .

అతని మొఖం ఎర్రగా అయింది. 'ఒరేయ్...' తీవ్రంగా అరచాడతను రమణ ఆగిపోయి ఆశ్చర్యంగా రాజారావు వంక చూశాడు.

'మరోసారి . ఇందిర నేమయినా అన్నావంటే నీ అంతు చూస్తాను ' అన్నాడు పిడికిళ్ళు బిగించి

అతని కోపానికి రమణ భయపడినా, అతని మాటలు చాలా చిన్నతనం అనిపించింతతనికి.

'ఆ పిల్లనంటే నీకెందుకురా అంత కోపం? ఇందిర నీకేమయినా బంధువా?'

'అదంతా నీ కనవసరం!' అన్నాడు రాజారావు కోపంగా.

రమణకి ఉక్రోషం ఆగలేదు.

'నా యిష్టం! నేనంటాను! ఏం చేస్తావ్?' అన్నాడు మొండిగా. అతని మాట పూర్తికాకుండానే రాజారావు అతని మొఖం మీద బలంగా గుద్దాడు. రమణ చేతిలోని పుస్తకాలు క్రింద పడేసి రాజారావుతో కలబడ్డాడు

వాళ్ళముందు నడుస్తున్న నలుగురు కుర్రాళ్ళు వచ్చి వారిద్దరినీ విడదీశారు.

'అరె! ఏమయిందిరా! ఇంతవరకూ బాగానే వున్నారుగా?'

రమణ ముక్కు వెంబడి రక్తం కారు

తోంది. ఆయాసంతో రొప్పుతూ అన్నాడు.

'రాస్కెల్.. వీడు ... ఆ శూర్పణఖని... లవ్ ..చేసేడురా..అం...దు...కే దాన్నంటే.. వీ . డి . కి కోపం...'

ఆమాటతో రాజారావు కోపమంతా మాయమయిపోయింది. ఓరకమయిన భయం అతనిలో ప్రవేశించింది. నెమ్మదిగా రమణదగ్గరకు నడిచి అతని రెండు చేతులూ పట్టుకొన్నాడు.

'రమణా! క్షమించరా! ... జరిగింది మర్చిపోదాం!.. కాని అలాంటిమాటనకు! ఇందిర వాచెల్లాయిలాంటిదిరా...

బ్రతిమాలుతోన్న కంఠంతో అంటూంటే అతని కళ్ళు చెమ్మగిలినయి. రమణ విసురుగా చేతులు వెనక్కులాక్కొని ముందుకునడిచాడు.

ఆసాయంత్రం ఇందిర రాజారావుకోసం రాలేదు. రాజారావు మనస్సంతా అల్లకల్లోలమయిపోయింది. ఇందిర మనసు ఖచ్చితంగా గాయపడివుంటుంది. ప్రొద్దున్న ఇందిరని కలుసుకొని' క్షమాపణ చెప్పకోవాలి...

మర్నాడు ప్రొద్దున్న తొమ్మిదవుతోండగా ఇందిర ఇంటికివెళ్ళి బయటనుంచి 'ఇందిరా' అంటూ పిల్చాడతను.

'కాలేజికి వెళ్ళిపోయింది...' అంది ఇందిర తల్లి. ఓవేళ ఇందిర తనమంచి తప్పించుకు తిరుగుతుందేమో, అని అనుమానం వచ్చిందతనికి. త్వరత్వరగా కాలేజివైపు నడిచాడతను. కాలేజి గోడలమీద తాటికాయంత అక్షరాలతో శూర్పణఖా— రాజారావుల పేర్లు అసభ్యకరమయిన విశేషలతో వ్రాసివున్నయి. అది చూసేసరికి రాజారావు కళ్ళు చీకట్లు క్రమ్మినయి. క్లాసుకి వెళ్ళబుద్ధి కాలేదు.వెనక్కు తిరిగి ఇంటికొచ్చేశాడు. బోలెడాలోచనలతో సతమతమయి పోసాగాడతను.

'ఇదంతా ఇందిర మూలానే జరిగింది... ఆ రాక్షసిమూలానే తనకింత అవమానం! ఇక కాలేజీలో తన మొఖం ఎలా చూపించగలుగుతాడు?...ఇకనుంచి ప్రతివాడూ తననిచూపి హేళన చేస్తాడు. ఇంత అందవిహీనురాలితో తనకి సంబంధం...ఛీ... తను ఈ కాలేజినుంచి వెళ్ళిపోవాలి... లేపోతే ఇందిరయినా వెళ్ళాలి. ఛ. ఛ..

లేనిపోని జాలిపడి...తన పరువుపోగొట్టుకొన్నాడు...తనపాలిట దయ్యంలా దాపురించింది...

'రాజా!' ఇందిర గొంతు విని త్రుళ్ళిపడ్డాడు రాజారావు.

ఆమెని చూడగానే అతనికి విపరీతమయిన కోపం వచ్చింది.

'ఏయ్... ఇక్కడికెందుకొచ్చావ్ ... ఫో ఇక్కడి నుంచి.. నన్ను శనిలాగా పట్టుకొన్నావ్...నీ మూలాన నేను అల్లరి పాలయ్యాను.. అంత వికృతంగా పుట్టిన దానివి మాటలంటే పడలేవూ?.. ఫో! మళ్ళీ నా దగ్గరకి రాబోకు ... నేనూ అంటాను.. నువ్వు శూర్పణఖవి.. శూర్పణఖ...' పిచ్చిగా అరచాడు రాజారావు.

ఇందిర నిశ్చేష్టురాలయి నిలబడిపోయింది. అప్రయత్నంగా ఆమె కళ్ల వెంబడి నీళ్ళు తిరిగినయి.

'రాజా .. నాది తప్పే ... తప్పంతా నాది...' బిగ్గరగా ఏడ్చేస్తూ అందామె. ఏడుస్తూనే పరిగెత్తుకొంటూ వెళ్ళిపోయింది.

ఆ రోజంతా రాజారావు గదిలోంచి బయటకు రాలేదు.

మర్నాడు ప్రొద్దున్న రాజారావు నిద్రలేచే సరికి ఎనిమిదయి పోయింది. లేవడంతోనే అతనికి ఇందిర గుర్తుకొచ్చింది.

'పాపం! తను చాలా మాటలన్నేడు. పిచ్చిపిల్ల! ఏం చేస్తుంది? ... రాత్రి అన్నం తిందో లేదో?.. ఇందిరకి తన బాధ చెప్పకోడనికి ఎవరయినా ఉన్నారూ అంటే అది తను ఒక్కడే! తనే అలా...'

'ఒరేయ్ రాజా!' తల్లి వచ్చింది.

'పాపం ఇందిర తెల్లారుఝామున కిరసనాయిలు పోసుకొని తగలబెట్టుకొని చచ్చిపోయిందిట ఓసారి వెళ్ళిరారాదూ?'

రాజారావు గుండెలు ఓక్షణం ఆగిపోయి తిరిగి కొట్టుకోడం మొదలెట్టినయి. దూరంగా సన్నగా ఏడుపులు వినబడుతున్నయి అతను లేవ్వాలని ప్రయత్నించి విఫలుడయ్యాడు. అతని శరీరంలోని ఏ భాగమూ అతని స్వాధీనంలో లేదు. ●



# బొమ్మల సీరియల్ ప్రారంభం





















కండనొప్పి
ఎంత ఎక్కువగా ఉన్నా
స్థానికమే

# అమృతాంజనం

## వాడి శీఘ్రంగా నివారణ పొందండి

స్థానికంగా ఉండే బాధను నివారించుకోడానికి ఊరికే మందులు ఎందుకు పుచ్చుకుంటారు? నొప్పి ఉన్న చోటుమీద అమృతాంజన్ రాసి అమోఘంగా శీఘ్రంగా నివారణను పొందండి. ఏ అపాయం లేకుండా కండరాల నొప్పులకు, తలనొప్పికి, బెణుకులకు ఇంకా కీళ్ల నొప్పులకు అమోఘంగా గుణమిచ్చే అమృతాంజన్ 10 రకాల ఔషధాలు చేరిన మందు. అమృతాంజన్ గుండెజలుబుకే కాక సాధారణ జలుబులకు కూడా మంచి మందు. కొంచెంకొంచెమే ఉపయోగించవలసి ఉంటుంది కాబట్టి ఒక సీసా మీ కుటుంబానికంతాకలిపి నెలల తరబడి వస్తుంది.

అవసరానికి ఎప్పుడూ అమృతాంజన్ ఉంచుకోండి. అమృతాంజన్ 70 ఏళ్ల ప్రసిద్ధిని పొందిన నమ్మకమైన గృహౌషధం.

**అమృతాంజన్ <u>నొప్పులు జలుబుల</u> నివారణకు 10 రకాల ఔషధాలు చేరిన మందు.**




అమృతాంజన్ లిమిటెడ్
మద్రాసు • బొంబాయి • కలకత్తా • ఢిల్లీ

AVT/AM/2018




ఒకప్పుడు మల్లన్న మంత్రి దసరా ఉత్సవాలకు చక్రవర్తి రాజధానికి వెళ్లాడు. ఉత్సవాలకు వచ్చిన రాజు లందరికీ చక్రవర్తి విజయదశమినాడు విందు చేశాడు. రాజులందరితోపాటు మల్లన్న మంత్రి కూడా విందుకు వెళ్లాడు.

అక్కడకు వచ్చిన రాజులందరూ విందుకు ముందుగా ఒకరినొకరు పల్కరించుకొని కబుర్లు చెప్పుకొనడం ప్రారంభించారు. ఆ సమయంలో తూర్పుదేశపు రాజు ఉంగరం చేతినుండి జారి పడి పోయింది కాని దాన్ని తూర్పుదేశపు రాజు గమనించలేదు. ఉత్తర దేశపురాజు, యెవరూ చూడ కుండా ఆ ఉంగరాన్ని తీసి తన అంగీ జేబులో వేసికొన్నాడు.

మల్లన్న మంత్రి మాత్రం దీని నంతటినీ గమనించాడు. ఆ పరిస్థితిలో యీ విషయాన్ని వెల్లడిస్తే ఉత్తర దేశపు రాజుకు అవమానం కలుగు తుంది. తూర్పుదేశపు రాజుకు ఉత్తర దేశపు రాజుకు రాజ్యపు సరిహద్దులను గురించి తగాయిదాలు ఉన్నాయి. అందు చేత ఉత్తరదేశపురాజు ఆ ఉంగరాన్ని ఉప యోగించి అబద్ధపు పత్రాలను సృష్టించవచ్చును కాబట్టి ఆ ఉంగరం ఉత్తరదేశపు రాజువద్ద ఉండిపోవడం మంచిదికాదు.

విందు పూర్తికాగానే అక్కడకు వచ్చిన రాజులకు వినోదం కలిగించడానికి నాట్య ప్రదర్శనం యేర్పాటు చేయ బడింది. నాట్య ప్రదర్శన పూర్తి కాగానే మల్లన్న మంత్రి లేచి చక్ర వర్తితో యిలాగ అన్నాడు.

'ప్రభూ! నేను యీ మధ్యను మా గురువుగారి వద్ద యింద్రజాలం నేర్చుకొన్నాను. దాని ద్వారా నేను అసాధ్యమైన పనులను కూడా చేయ గలను!'

ఆ మాటలు వినగానే చక్రవర్తితో సహా రాజులందరూ ఆ విద్యను తమకు చూపించవలసినదిగా మల్లన్న మంత్రిని కోరేరు. అప్పుడు మల్లన్న మంత్రి అక్కడఉన్న వేదిక మీదకు యెక్కాడు. తరువాత తనలో తాను కొంచెంసేపు యేవో మంత్రాలను చదివేడు

మల్లన్న మంత్రి అప్పుడు యేవో మంత్రాలను చదువుతూ తూర్పు దేశపురాజు వైపు చెయ్యి చాపి, తన వైపుకు లాగుకొన్నాడు. వెంటనే ఆ చెయ్యి ఉత్తరదేశపు రాజు వైపుకు చాపి యింద్రజాలం పూర్తి అయిం దని చెప్పాడు.

'అసాధ్యమైనపని, యింద్రజాలం వలన యేమి జరిగింద'ని అందరూ అడగ్గా మల్లన్న మంత్రి వారితో యిలాగ అన్నాడు. 'తూర్పు దేశపు రాజు చేతి ఉంగరం ఉత్తరదేశపు రాజు అంగీ జేబులోనికి వెళ్లింది.

వెంటనే తూర్పుదేశపు రాజు తన చెయ్యి చూసుకోగా ఉంగరం కన్పించ లేదు. తరువాత అందరూ ఉత్తర దేశపురాజు అంగీ జేబు చూడగా అందులో ఉంగరం కన్పించింది. తూర్పుదేశపురాజు తన ఉంగరాన్ని తీసి కొన్నాడు.

చక్రవర్తి తరువాత రహస్యంగా మల్లన్న మంత్రి వల్ల సంగతినంతా తెల్సుకొని అతని తెలివికి సంతోషిం చాడు.





ఆడవాళ్ళు అందంగా కనిపించడానికి ఆభరణాలే ధరించ నక్కరలేదు. తీరైన వస్త్రధారణలోనే అందాన్ని పెంపొందించుకోడానికి అవకాశం ఉంది. వనితలు ధరించే ఉడుపులన్నిటిలో అందమైనది, అందరికీ అందుబాటైనది, హుందాగా కనిపించేది చీర. అందమైన ఆడవారు చీరతో మరింత అందంగా కనిపిస్తారు. ప్రముఖ [illegible] శ్రీ [illegible] చీరలంటే మక్కువని ప్రదర్శిస్తున్నారు.



చీరకట్టుతో రకరకాలయిన ఫాషన్‌లను ఎన్నో మనం చూస్తున్నాం. సందర్భానుసారంగా కట్టూబొట్టూ మార్చాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ఠీవైన చీర కట్టుకి మరేరకమైన వస్త్రధారణ అయినా తీసికట్టే అవుతుంది. కాలేజీకి వెళ్లేప్పుడు ఒక రీతిగా, ఉద్యోగిగా ఉన్నప్పుడు ఆఫీసుకి వెళ్లే సమయంతో అందుకుతగిన విధంగా, ఇంట్లో గృహిణిగా బాధ్యతల్ని నిర్వహించే

# ఫాషన్లు



తరుణంలో మరోరీతిగా, సామాజిక కార్యక్రమాల్లో ఇంకో తీరుగా తగినట్లు చీర కట్టుకోడం ఆకర్షణీయంగా ఉంటుంది. షాపింగ్‌కి, సాయం సమయాల్లో వ్యాహ్యాళికి వెళ్లేటప్పుడు వేరే విధంగా కట్టుకోవడం కంటికి ఇంపుగా వుంటుంది. ప్రస్తుతం వాడుకలో ఉన్న పలురకాల చీరకట్టు విధానాల్ని బొమ్మలలో చూడవచ్చు.

# ఫాషన్లు




36వ పేజీలోని బొమ్మలో చూపిన కట్టు కూర్గు ప్రాంతం స్త్రీలలో ఎక్కువగా కనిపిస్తుంది. ఆధునిక పద్ధతుల్లో వనితలు చీర కట్టే విధానాల్ని 37,39వ పేజీల్లో ఉన్న బొమ్మలలోను, పైన ఉన్న బొమ్మలోనూ, తరువాతి పేజీల్లో ఉన్న బొమ్మల లోనూ చూడగలరు.

# మై ఫెయిర్ లేడీ



























రేపు ఎందుకైన మంచిదని ఈ కార్టూనిస్టు తన పేరును తెలుపడంలేదు - సం॥

# నలభయ్‌తొమ్మిది మంది పొగడ్త్రు...

'షడ్‌శాస్త్రాలూ ఒకదాని నొకటి ఖండించుకుంటాయి కాని, ఆరిటిలో ఏ ఒక్కటీ శ్రీ వళ్ళువర్ తన 'కురళ్'లో చెప్పిన సిద్ధాంతాన్ని ఖండించదు; అన్ని శాస్త్రాల సారాన్ని క్రోడీకరించటంచేత ప్రతి శాస్త్రమూ అది తమకిచెందినదే అనటం జరుగుతుంది' అన్నాడు కలాదర్ తిరుక్కురళ్ గ్రంధాన్ని ప్రశంసిస్తూ. దానిని చూసినప్పుడు వంగి నమస్కరించాడు.

'దేవతలు అమృతంసేవించి దాని రుచి తెలుసుకోగలిగారు, మానవుడు కురళ్ మూడు పాదుగు (భాగా)లలోనుంచీ వచ్చే క్షీరాన్ని సేవించి అమృతం రుచి తెలుసుకొనగలుగుతారు,' అని అలంగ్‌కుడి వంకవార్ అన్నాడు. అంటూ కురళ్‌ని తలతో స్పృశించాడు.

కులపతి నయనార్ ఈ గ్రంధానికి పుష్పాంజలి సమర్పిస్తూ ఇలా అన్నాడు:

'కురళ్ హృదయకమలాన్ని వికసింపచేసి చీకటిని వెళ్ళగొడుతుంది. ఈ చీకటిని మరొకవిధంగా చెదరకొట్టేమార్గం లేదు. అందువల్లనే కురళ్‌ని తీక్షణ కిరణాలుకల సూర్యునితో పోల్చవచ్చు. సూర్యుడేకదా, కొలనులోని తామరని వికసింపచేసి లోకంలోని తిమిరాన్ని తరిమివేస్తాడు!'

ఈ విధంగా 'సంఘం' కాలంలో నలభయి తొమ్మిది మంది పండితులు మధురలో కూడి నలభయి తొమ్మిది ప్రశంసలని ఆశువుగా చదివారు.—కురళ్ గ్రంధ రచయిత శ్రీ వళ్ళువర్ తన పుస్తకాన్ని వారికి ఇచ్చి తమ అభిప్రాయాలని తెలుపవలసిందిగా కోరాడు.

వళ్ళువర్ పంచమజాతికి చెందినవ్యక్తి. అందుచేత, మొదట్లో వారు అతన్ని ఏవగించుకున్నారు. కాని, క్రమక్రమంగా దానిని చదవటం ప్రారంభించటంతో వారి అసహ్యం ప్రశంసగా మారిపోయింది. వారి ప్రశంసలు చరిత్రలో మిగిలిపోయాయి. తమిళ పాఠకులు కురళ్‌ని ఎంత శ్రద్ధతో చదువుతారో ఈ పొగడ్తలనీ అంత శ్రద్ధతోనే చదువుతారు.

వళ్ళువర్‌కాలం ఎప్పటిదో ఇంకా నిర్ధారణకాలేదు. క్రీ. శ. నాలుగవ శతాబ్దంవాడని కొందరి అభిప్రాయం. ఎప్పటివాడయినప్పటికి నేటి మదరాసులోని 'మయిలాపురం'లో ఒక మామిడి తోపులో ఒక చిన్న పిల్లవాడు ప్రత్యక్షం అయ్యాడు. అతను కేవలం పూవులనుంచి రాలే తేనె తిని బతుకుతున్నాడు. ఈ తోపు పక్కనే ఒక శివాలయం ఉంది. ఆ ఆలయానికి ఒకరోజున ఒక వెళ్ళాల వనిత వచ్చింది. ఆమెకి సంతానం లేదు. సుపుత్రుడిని ప్రసాదించమని దేవుడిని ప్రార్థించటానికి వచ్చింది. పార్వతీదేవి ఆమెని కరుణించి, 'ఈ దివ్యశిశువుని పెంచుకో,' మని చెప్పింది మామిడి తోపులోని బిడ్డని చూపించి. ఆ వెళ్ళాల వనిత ఆనందంతో పిల్లవాడిని స్వీకరించింది. ఆమె భర్తకూడ మహదానందంతో పిల్లవాడిని స్వీకరించాడు. ఇద్దరూ అతనిని ఎంతో ప్రేమతో సాకటం ప్రారంభించారు. కాని వారి బంధువులు కొందరు మాత్రం, 'ముక్కూ మొగం ఎరుగని శిశువుని తీసుకురావడం కూడ'దనటం మొదలుపెట్టారు. ఈ బాధపడలేక వారిద్దరూ పిల్లవాడిని ఒక పంచమ దంపతులకి వప్పగించారు.

వళ్ళువర్ లేక తిరు—వళ్ళువర్ పెరిగి పెద్దవాడయ్యాడు. బాల్యదశలోనే తనవల్ల తన తల్లిదండ్రులకి వచ్చిన ఇబ్బందిని గురించి తెలుసుకున్నాడు. అందుచేత ఆ చోటు వదిలి తిరుమూలర్, పోగర్ మొదలయిన మునులు నివసిస్తున్న పర్వతాలకి వెళ్ళిపోయాడు. త్వరలోనే అన్ని శాస్త్రాలనీ నేర్చుకున్నాడు. ఇంతలో ధనికుడయిన ఒక వెళ్ళాల కుటుంబీకుడు ఇతని పాండిత్యాన్ని గుర్తించి తన కుమార్తె 'వసుగయి'ని ఇచ్చి పెళ్ళిచేస్తానన్నాడు. తిరువళ్ళువర్ గృహస్థాశ్రమ ధర్మాన్ని గుర్తించి వివాహంచేసుకున్నాడు. జీవనోపాధికి తక్కిన పంచములలాగనే నేత నేసేవాడు.

క్రమంగా అతని ప్రతిభ, కీర్తి నలుమూలలో పాకింది. అతని అభిమానులు, శిష్యులు, అనుచరులువచ్చి అతని సిద్ధాంతాలని గ్రంధరూపంలో రాయమన్నారు. లోకానికి ఇదొక పెద్ద మేలుచేసినట్లవుతుందన్నారు తిరువళ్ళువర్ వారి కోరిక ప్రకారమే 1330 ద్విపద శ్లోకాల గ్రంధం రాశాడు. వాటిని విన్నవారంతా, 'ఈ గ్రంధాన్ని మధురకి తీసుకువెళ్ళి అక్కడివారికి వినిపించాలి,' అన్నారు.

చివరికి తిరుక్కురళ్ అందరి పండితుల భక్తి ప్రశంసలనీ పొందకలిగింది.

నేడు కురళ్ తమిళసాహిత్యంలో ఒక మహాగ్రంధం; కులమత విచక్షణ లేకుండా ధర్మప్రబోధంచేసే గ్రంధం; తన శ్లోకాలలో వళ్ళువర్ నీతి, బుద్ధిబలం వీటి ప్రాముఖ్యతని చక్కగా చిత్రించాడు; మానవుడి సర్వాశ్రమధర్మాలనీ వివరంగా చెప్పాడు; ఎక్కడ కరుణరసం తగ్గకుండా చదివేవారి హృదయాలని కదిల్చివేసేట్లుగా రాశాడు. నేటి మదరాసు రాష్ట్రంలో తిరుక్కురళ్ శ్లోకాలని బస్సులలో ప్రదర్శించే ఏర్పాట్లు కూడా చేస్తున్నారు...

—ఎస్.



# జీవనరాగం

ఉన్నవ విజయలక్ష్మి

### జ రి గి న క థ

ఇద్దరు అన్నయ్యలకి, ఇద్దరు అక్కయ్యలకి ముద్దుల తమ్ముడు నిరంజనం. అందరిలోకి వచ్చగావున్నవాడు అతను. అతనికి భార్య పోవడంతో అత్తగారు సీతమ్మగారిదే యజమాయిషీ. వసంత నిరంజనం కూతురు. పెద్ద కొడుకు మధు. పట్టభద్రురాలయిన అమ్మాయి సుధతో అతనికి పెళ్ళవుతుంది. సీతమ్మగారి జ్వరం ఆమె ప్రాణాన్ని తీసుకుంది. వంటపనికి కాంతమ్మని పెట్టుకుంటారు. నిరంజనం గురించిన ఒక కొత్త కథని సుధకి చెబుతుంది కాంతమ్మ. మామగారి గురించిన అబద్ధ ప్రచారానికి ప్రతిఫలంగా కాంతమ్మని పనిలో నుండి తొలగిస్తుంది సుధ. పనంతా సుధ నెత్తిమీద పడుతుంది. ఒకరోజు సుధవాళ్ళ మామయ్య వచ్చాడు తర్వాత, సుధలో కొంత మార్పు వస్తుంది. మధుని లెక్చరరు ఉద్యోగం విడిచిపెట్టి ఇతర ప్రయత్నాలు చెయ్యమంటుంది.

## 12

''నిజం చెప్పండి. ఈ కూపస్థ మండూకంలాంటి జీవితం మీకు బోర్ కొట్టడంలేదా?'' సమాధానం రాబట్టా లన్నట్లు పట్టుదలగా అడిగింది సుధ

మధుకూడ ఇంక మౌనంగా కూర్చో లేక పోయాడు 'ఒక్కవిషయం అడుగు తాను చెప్పు—పెళ్ళికిముందు నన్నుగురించి పూర్తిగా తెలుసుకదూ' సూటిగా సుధ కళ్ళల్లోకి చూస్తూ అడిగాడు.

సుధ ఇబ్బందిగా కళ్ళు వాల్చి,

'అంటే?' అంది మెల్లిగా.

'అదే నేను లెక్చరర్‌ననీ...'

'మనిషికి ఏంబిషన్సు వుండకూడదా, లెక్చరర్‌గా చేరినవాడు బ్రతుకంతా అందులోనే గడపాలని ఎక్కడాలేదు.' మాట మధ్యలోనే రోషంగా అంది సుధ.

'ఉన్నదాంతో తృప్తిపడేవాళ్ళు మాత్రం వుండరా—నాకిక్కడే బాగుంది. నేనీవూరు వదిలి ఎక్కడికీ వెళ్ళదలుచుకోలేదు — నీకీవూరు నచ్చలేదని నాకూ తెలుసు. అయినా ఎలాగో సరిపెట్టుకోటానికి ప్రయత్నించాలే కాని, పరాయి వ్యక్తి ముందు నీ అసంతృప్తిని వెల్లడించటం మాత్రం భావ్యంగాలేదు—నాన్నగారుకూడ చాల నొచ్చుకున్నట్లే వున్నారు.'

'ఇది మరీ బాగుంది. మామయ్య పరాయివాడా? అతనితోనయినా నేను మీమీదేం నేరాలు చెప్పలేదే-మీ ఎదురు గానే వున్న విషయాలు చెప్పాను.'

'ఉన్నవిషయాలే అయినా, కొన్నికొన్ని మేనమామతోనే కాదు స్వంత తల్లిదండ్రు లతోకూడ చెప్పకోకూడదు — మాట వచ్చింది కాబట్టి చెప్తున్నాను —' సంసారం అన్నాక అనేక లోటు పాట్లు వుంటాయి — భార్యాభర్తల మధ్య జీవితంలో ఎప్పుడో అప్పుడు ఎందుకో అందుకు అభిప్రాయభేదాలు వస్తూనే వుంటాయి. అసంతృప్తి కలిగే క్షణాలు ప్రతివ్యక్తికీ ఎప్పుడో అప్పుడు వస్తూనే వుంటాయి. అవన్నీ వాళ్ళిద్దరి మధ్యాగోప్యంగా ఉన్నవాడే చూసేవాళ్ళకి ఆ సంసారంపట్ల సదభిప్రాయం, ఆ వ్యక్తులమీద అభిమానం, గౌరవం కలుగుతాయి. అలా గుట్టుగా సంసారం గడుపుకోగలిగిన స్త్రీపురుషులు ఇతర్ల దృష్టిలో చాలా అదృష్టవంతులు — అంతేకాని మరోమనిషిముందు తన సంసారంలో ఏవో బాధలున్నాయంటూ వాపోయే స్త్రీకి కాని పురుషుడికి కాని అప్పటికి సానుభూతి చూపించినా తరువాత ఎంతో లోకువగా చూస్తారు. అడుగడుగుకీ అనవసరమైన జాలి ప్రదర్శించబోతారు. ఎంత వుంటే ఏం? ఆ సంసారంలో సుఖం లేక పోయాక అన్నట్లు చులకనగా మాట్లాడుతారు—ప్రతీభార్యా ప్రతిభర్తాకూడా ఆ విషయాల్ని గ్రహించుకోవాలి. ఇంత చదువుకున్న నువ్వుకూడ అలా మాట్లాడటం ఏం బాగుండలేదు...' నచ్చ చెప్తున్న ధోరణిలో సాగిపోతున్న భర్త మాటలకి సుధకి చిరాకు వేసుకొచ్చింది.

'ఏమిటిప్పుడు మీరనేది — మనిద్దరం పోట్లాడుకుంటున్నామని చెప్పలేదు నేను. మామగారు కాల్చుకు తింటున్నారని అంతకన్నా చెప్పలేదు—ఈ దిక్కుమాలిన ఊళ్ళో ఏ సౌకర్యంలేదు. అన్న ఒక్కమాట అన్నందుకు మీరింత పెద్ద లెక్చరిచ్చారు — ఎంతసేపు మీకు, మీ నాన్నగారికి మనసూ నొవ్వకుండ వుండలనుకుంటారేకాని నా సదుపాయాలు సరదాలు ఒక్కనాడైనా ఆలోచించారా—ఎంతో అపురూపంగా ముద్దుగా పెరిగినదాన్ని — అయినా తప్పనిసరి అయింది కనక అన్ని పనులూ నేర్చుకోటానికే ప్రయత్నించాను. శక్తివంచనలేకుండా చేస్తూనే వున్నాను. మీకుమాత్రం తృప్తిగా వుండటంలేదు' సుధ కంఠం కొద్దిగా వణికింది.

తను చాలా ఆవేశపడ్డాననుకున్నాడు మధు. అందుకే 'ఛీ' అదేమిటి, నీకు పనిపాటలు రావనీ చెయ్యలేవనీ నేనెప్పుడయినా అన్నానా—సిటీలో పెరిగినదానివి. నీకిక్కడుండటం చిరాగ్గానే వుంటుంది—అయినా ఎలాగో సర్దుకుని సంతోషంగా వుండటానికే ప్రయత్నించాలి.' అన్నాడు అనునయంగా.

'నా సంతోషం సంగతిసరే' మీ కెరియర్ పాడు చేసుకుంటున్నందుకు మీకు బాధగాలేదా.'

'లేదు సుధా నా కెంతమాత్రం బాధగాలేదు—నాన్నగారి దగ్గిరే వుండగలుగుతున్నందుకు నా కెంతో సంతోషంగా వుంది—బాధ్యత నెరవేర్చటంలో ఎంత తృప్తి హాయి వుంటాయో నే నిప్పుడే తెలుసుకున్నాను.' ఆ సంతృప్తి అతని కళ్ళల్లోకూడ తొణికిస లాడింది.

'మంచి వేదాంతమే వంటపట్టింది—పోనీ ఆయన్నినదిలి వెళ్ళలేకపోతే,' ఆయన్నికూడ మనతోపాటే రమ్మనరాదా.

ఏమంటాడో అన్నట్లు కొస్త జంకుతూనే అడిగింది.

చిరాగ్గా మొహం చిట్లించుకున్నాడు మధు. 'నీ సలహాకి సంతోషించాం కాని, ఏ పనీలేకుండ కూర్చుంటె ఆయన కెలా తోస్తుంది — అయినా దూరపుకొండలు నునుపు అన్నట్లు అక్కడేదో అందలం ఎక్కి వూరేగొచ్చు అని నువ్వు అనుకుంటున్నావేమో. నీలాగే భ్రమపడి పెద్ద జీతాలు వస్తాయని బొంబే, ఢిల్లీలు పరుగెత్తివెళ్ళి, ఆతరువాత 'ఎందుకొచ్చాంరా భగవంతుడా' అని ఏడుస్తున్న వాళ్ళ కూడ నాకు తెలుసు.' కటువుగా వుంది అతని కంఠస్వరం.

'నిజమే పాపం. బొంబే వెళ్ళినవాడు తలవపెట్టి మళ్ళీ వెనక్కివచ్చి మీ దగ్గర ఏడ్చాడు — ఏందుకొచ్చినగొడవ లెండి, మీ నాన్నగారు ప్రాక్టీసుమాని ఎక్కడికీరారు. ఆయన్ని విడిచిపెట్టి మీరు అసలు కదలరు.' రుసరుసలాడుతూ మూతి ముడుచుకుంది సుధ.

'అంతే మరి చెప్పానుగా, అమ్మమ్మ ఉన్నవాళ్ళ నాకు ఏమీ తెలిసేదికాదు. బాధ్యత అంతకన్న ఉండేదికాదు—ఇంట్లో ఆయనకి వండిపెట్టే దిక్కుకూడ లేకుండా ఒక్కరినీ వదిలేసి నేను వెళ్ళలేను—ఇంక ఆ విషయమై మాట్లాడకు.' ఆజ్ఞాపించినట్లే సమాధానంచెప్పి లేచి వెళ్ళి కుర్చీలో కూర్చున్నాడు. అతని మనస్సంతా ఏమిటోగా అయిపోయింది. ఏమీతోచక టేబిలుమీది పుస్తకం చేతిలోకి తీసుకున్నాడు.

ఏదైనా ఆలోచన వచ్చిందంటే దాన్ని అమలులో పెట్టేదాకా సుధకి నిద్ర పట్టదు. అందుకే ఆ సంభాషణని అప్పటికయినా కట్టిపెట్టకుండ మెల్లిగా గొణగటం మొదలుపెట్టింది.

'కొడుకులు కోడళ్ళ ఎల్లకాలం దగ్గరే వుండలనుకోడం ఉత్త తెలివితక్కువతనం...'

మధులోకూడ సహనం చచ్చిపోయింది, విసుగ్గా పుస్తకం టేబిలుమీద విసిరేసి. కిటికీదగ్గరగా వెళ్తూ 'అనవసర విషయాల్లో కలగజేసుకోకుండా నువ్వు నోటిని కొస్త అదుపులో పెట్టుకుంటే బాగుంటుంది.' కటువుగా అని, చీకటిలో చెట్ల వంక చూస్తూ నిలబడ్డాడు.

అవాళ లేచినవేళా విశేషమో, మామయ్య హోదా కళ్ళకి కప్పిపోయిన అహంకారపుపొరో సుధలో పట్టుదలని పంతాన్ని ఇంకా ఎక్కువ చేశాయి. ఏదో చెప్పబోతుంటే,

'ప్లీజ్ సుధా, ఈ విషయమై మరోసారెప్పుడైనా మాట్లాడుకుందాం. నాన్నగారింకా హాల్లోనే వున్నారు—'ఆజ్ఞాపించటం చేతగాక అర్థిస్తున్నట్లు అడిగాడు.

'ఉంటే వుండనివ్వండి నేనేం లేని మాట అనటంలేదుగా—ఇంటికి ఆడదిక్కు కావాలన్నసంగతి ఆయన ఏనాడో గ్రహించాల్సింది—ఎవరిమీకో ఆ బాధ్యత వదిలి



తను నిశ్చింతగా వుండాలనుకోటం...'

'షోర్ముయ్. ఆయన్ని విమర్శించే అధికారం నీకులేదు'—వళ్ళు తెలియనంతగా వచ్చిన ఆగ్రహం చటుక్కున చల్లబడిపోయి మధు కంఠము నేత్రాలు కూడ ఆర్ద్రమయి పోయాయి. 'ఆయన చేసిన త్యాగాన్ని నువ్వు గుర్తించి ఆయన్ని అభిమానించి గౌరవించటం నేర్చుకుంటావనుకున్నాను—ఏ తండ్రీ తన పిల్లల కోసం చెయ్యని త్యాగం ఆయన మా కోసం చేశారు. దానికి ప్రతిఫలంగా నేను ఇవ్వగలిగేది అభిమానం ఒక్కటే—అది నా కనీస కర్తవ్యం...'

ఒక్క క్షణం తెల్లబోయినట్లు చూసిన సుధ, 'హుం,' అంటూ ఈసడింపుగా విదిల్చి పారేసింది. 'త్యాగం, కర్తవ్యం, బాధ్యతలాంటి పెద్దపెద్ద మాటలన్నీ చెప్పకోటానికి బాగానేవుంటాయి—వాటివల్ల ఎలాంటి పరిస్థితు లేర్పడతాయో కూడా ఆలోచించుకోవాలి— మీరు అంత గొప్పగా చెప్పకుని మురిసిపోతున్న ఆ త్యాగం నా పాలిట శాపంగా పరిణమించింది. హాయిగా రెక్కలు విప్పకుని ఎగిరే నా మనస్సుని పంజరంలోపెట్టి బంధించింది—' ఆవేశంగా చెప్పకు

# జీవనరాగం

పోతున్న సుధకి చటుక్కున ఏదో గుర్తు వచ్చింది— ఒకనాడు నిజం కాదనుకున్నదే ఆ క్షణంలో ఒక్కసారిగా అద్భుతమైన సత్యంగా మారిపోయి ఆమె కళ్ళముందు నిలిచింది—ఆ విషయమై నిజానిజాలు, ఉచితానుచితాలు మరోసారి ఆలోచించ గలిగే స్థితిలో తను లేదిప్పుడు—

'చూడండి, మరోవిషయం — మీకు తెలియదో, తెలిసే నాదగ్గర దాచారో నా కర్థంకావటంలేదు— మీరంతా అనుకుంటున్నట్లు మీ నాన్నగారు త్యాగం ఏమీ చెయ్యలేదు—ఆయన సుఖం ఆయన చూసుకున్నాడు...'

ఉలిక్కిపడి వెనక్కి తిరిగిన మధు మాటలుడిగి చేష్టలు దక్కినవాడిలా చూస్తూ నిలబడిపోయాడు—

'పిల్లలక్షేమం కోరి, మళ్ళీ పెళ్ళి చేసుకోకుండా వుండిపోయారు అనే ఘనత ఆయనకి దక్కింది— కాని, ఆ మంచి పేరుకోసం పాకులాడకుండా ఆయన మళ్ళీ పెళ్ళిచేసుకునివుంటే ఈనాడు నేనెంతో సంతోషించేదాన్ని.'

'లేనిపోనివన్నీ వూహించుకుని దేవుడులాంటి మనిషిమీదకూడ అభాండాలు వేసే కుసంస్కారం నీలో వుందని నేనెన్నడూ అనుకోలేదు.' బాధ కోపం మిళితమై ఉన్నాయి ఆ స్వరంలో.

'నేనేమీ వూహించనూలేదు కల్పించనూలేదు. ఉన్న నిజాన్ని నిర్భయంగా చెప్పానంతే'

'నిజం — ఇంట్లోవాళ్ళకి వూళ్ళోవాళ్ళకికూడ తెలియని నిజం నిన్నకాక మొన్న వచ్చిన నీకు తెలిసిపోయిందన్నమాట—దాన్ని నిర్భయంగా చెప్పేశావు —ఛీ...'

'ఎందుకలా ఛీ త్కారం చేస్తారు — మీ కొక్కరికి తెలియక పోయినంత మాత్రాన ఇంకెవరికీ తెలియదనుకోకండి— ఊరంతా చెప్పకుంటున్నారని ఆ కాంతమ్మ స్పష్టంగా చెప్పింది.'

'సుధా' చెళ్ళున చెంపదెబ్బ పెట్టాలన్నంతగా వచ్చిన ఆవేశాన్ని అతి ప్రయత్నంమీద అణచుకున్నాడు

'కాంతమ్మ ఎలాంటిదో గ్రహించికూడ నువ్వావిడ మాటలు నమ్ముతున్నావా —అయితే, అయితే ఇది చెప్పు, ఆవిడ భయం నిజం అని నమ్మే ఆవిడ్ని పంపించేశావా, నీకూ అలాంటి అభిప్రాయమే వుందా...'

* *

చేతిలో వున్న పుస్తకం గుండెల మీద ఆనించుకుని కుర్చీలో వెనక్కి వాలిపోయిన నిరంజనం బాధగా రెండుకళ్ళూ మూసుకున్నాడు.

సుధ నోటివెంట వెలువడుతున్న ఒక్కొక్కమాట ఒక్కో వాడిబాణంలా గుండెల్లోకి దూసుకు పోతోంది భయంకరమైన నిర్వేదము నిస్పృహా అంతరంగం నిండా అల్లుకుపోయింది బాధతో అవమానంతో అణువణువూ కుంచించుకుపోతోంది—తననిచూస్తే తనకే జాలీ అసహ్యము—పెనవేసుకు పోతున్నాయి—తన జీవితంలో ఇలాంటిరోజు వస్తుందని ఊహించనైనాలేదు అనుకూలవతి అయిన అర్ధాంగితో, ప్రేమాభిమానాలు పంచిపెట్టే సంతానంతో జీవితం అంతా ఇంక హాయిగా గడిపేయగల ననుకున్నాడు —క్రూరమైన విధి పొంచివుండి తనవిలా





# వాటర్‌బరీస్ కాంపౌండ్

## ఉపశమనముతో సహా రోగనిరోధక శక్తిని కలిగిస్తుంది!

ఒట్టి లేబిలు




దగ్గు, జలుబులతో నీర్సముగా ఉండి రోగనిరోధక శక్తిని కోల్పోతారు. అటువంటప్పుడు మీకు యితర వ్యాధులు సోకే అవకాశముంది.

వాటర్‌బరీస్ కాంపౌండులో గల ఓషధులు ఆకలిని వృద్ధి చేస్తాయి, కోల్పోయిన శక్తిని తిరిగి చేకూరుస్తాయి. ఇతర వ్యాధులు కలగకుండా రోగనిరోధక శక్తిని యిస్తాయి. దీనిలో చేర్చబడిన 'క్రియొసోట్' మరియు 'గయొకోల్' దగ్గు, జలుబుల నుండి ఉపశమనమును కలిగిస్తాయి.

**బలము మరియు ఆరోగ్యమునకు**
**వాటర్‌బరీస్ కాంపౌండ్ త్రాగండి!**




వార్నర్-హిందూస్తాన్ లిమిటెడ్

# జీవనరాగం

కాటువేస్తుందని ఒక్కసారికూడ ఊహించలేక పోయాడు...

వసంతకి మూడునెలలు నిండుతున్నాయి. తెల్లగ బొద్దుగా రబ్బరు బొమ్మలావున్న ఆ పాప పాలబుగ్గలు సొట్టలు పడేలా అందంగా అమాయకంగా నవ్వుతూంటే తల్లిదండ్రులు సంతోషంలో మైమరచి పోయేవారు.

నాలుగేళ్ల మధు ముద్దుగా ఖబుర్లు చెప్తుంటే గర్వంతో వారికళ్లు తళుక్కుమనేవి. అలాంటి ఆనంద సమయంలోనే హటాత్తుగా మీనాక్షికి జబ్బుచేసింది–బ్రతుకుతుందనే ఆశ అందరూ వదులుకున్నారు. నిరంజనం తల్లడిల్లిపోయాడు సీతమ్మగారు సరేసరి — డాక్టరుమాత్రం శక్తివంచన లేకుండా మృత్యువుతో పోరాడి నట్టే ఎంతో శ్రమపడి చివరికి జయం పొందాడు. అందరిహృదయాలు తేలిక పడ్డాయి.

రోజులు గడచినకొలదీ క్రమంగా బలంపట్టి లేచి తిరుగుతుంది అనుకున్న మీనాక్షి పరిస్థితిలో మాత్రం మార్పేమీ కనిపించలేదు. ఏదో నీరసం, నిస్త్రాణ, లేస్తేనే పడిపోతనే మోననే ఓవిధమైన బెదురు ఆమెని వదిలిపెట్టలేదు.

డక్టర్లు పరీక్షచేశారు. జబ్బేమీ లేదు. నెమ్మదిగా బలం వడుతుంది అంటూ ఏవేవో టానిక్కులు వ్రాసి ఇచ్చారు. బలమైన ఆహారం పళ్లూ పాలూ తీసుకోమన్నారు.

గాలి అనీ ధూళిఅనీ సీతమ్మగారు జపాలు చేయించి తాయెత్తులు కట్టించింది—ఎన్ని చేసినా ఏమంత ఉపయోగం కనిపించలేదు—ఎలాగో లేచి కాస్త ఇటూ అటూ తిరిగినా మామూలుగా పనిపాటలు చేసుకోటం చేతకాలేదు. సీతమ్మగారు వుంది కనక ఇంట్లో వంటవార్పుకి ఏమీ ఇబ్బంది అనిపించలేదు. కాని, రోజుల తరబడీ జబ్బుమనిషిలా మంచంమీద వుండాలంటే ఎంతకష్టం! అది అనుభవించే వాళ్లకి చూసేవాళ్లకీ కూడ నరకంగానే వుంటుంది.

ఇంక లాభం లేదేమోనని అనిపించినా ప్రయత్న లోపం లేకుండా ఎద్ద డాక్టర్లని తీసుకొచ్చి చూపించాడు నిరంజనం. ఎవరు చెప్పినా ఒకటేమాట.

'ఇదోవిధమైన నరాల బలహీనత. దానికి ప్రత్యేకంగా చికిత్స అంటూ ఏమీ లేదు. బలానికి మందు తీసుకుంటూ, మానసికంగ ఎలాంటి కలతలు పెట్టుకోకుండా సంతోషంగా వుండాలి.'

'ఛ. ఏం డాక్టర్లో, ఒక్కరూ నా జబ్బు సంగతి కనిపెట్టలేకపోతున్నారు. వాళ్లు చదివిన చదువంతా దండగే,' నిరాశగా కళ్లు నీళ్లు పెట్టుకునేది మీనాక్షి.

ఈ డాక్టర్లంతా ఎన్ని భయంకరమైన వ్యాధులని కుదర్చటంలేదు? ఎంతమందికి ప్రాణభిక్ష పెట్టటంలేదు? వాళ్ల విజ్ఞానం అనుభవం అన్నీ మన దగ్గరికి వచ్చేసరికి ఎందుకూ పనికి రాకుండాపోయాయంటే అది మన దురదృష్టమే అనుకోవాలి— అయినా చూడు, వాళ్లంతా నీకు తప్పకుండా బాగవుతుందని చెప్తున్నారు. కొన్నాళ్లు ఓపిక పట్టాలి మరి. నువ్విలా అధైర్యపడకూడదు' అంటూ ఓదార్చేవాడు నిరంజనం.

హఠాత్తుగా ఓనాడు సీతమ్మగారికో ఆలోచన వచ్చింది. ఆలోచన వచ్చిందే తడవుగా అది కూతురు చెవిలో వేసేదాకా ఆవిడికి నిద్దరపట్టలేదు.

నీటిలో కొట్టుకుపోతున్నవాడికి గడ్డిపరక కనిపించినాసరే ఎలాగో అలా దాన్ని అందుకోగలిగితే ఇంక దాని ఆధారంతో ఒడ్డు చేరుకోవచ్చు అనుకుంటాడు. అలాగే వ్యాధిగ్రస్థుడికి ఎవరైనా ఏదైనా కొత్త విషయం చెప్పినప్పుడు అది ఆచరణలో పెట్టగలిగితే చాలు తనబాధ అంతా చేత్తో తీసేసినట్లు మాయం అయిపోతుందనే ఆశ కలుగుతుంది. అందులోని సంభవాసంభవాలని గురించి ఆలోచించే ఓపిక వారికుండదు—తల్లి చెప్పిన నిదర్శనాలతో మీనాక్షి అంతర్యం అంతా కొత్త కొత్త ఆశలతో నిండిపోయింది.

(ఇంకా ఉంది)




ఈ రోజులలో ఎవరిని భోజనానికి పిలిచినా అన్నీ అందుబాటులో సద్ది కూర్చుంటాం. కావలసినది చూసి వడ్డించుకుంటారు. లేదా అడుగుతా రన్నది — మామూలు. కాని పూర్వంలో అలాగా? విస్తరిలో బోర్లాపడితే పీపుప వడ్డించి చక్కా పోయేవారట! అతిథి సత్కారానికి అలా తరిమి తరిమి వడ్డించడం అప్పుడు గొప్ప. కాని ఈ రోజుల్లో అలా వడ్డిస్తే మనకి సభ్యత తెలియ దనుకుంటారు. భోజనాని కెవరైనా పిలిస్తే ఈ రోజుల్లో అన్నం తినని వాళ్ళు 'మేం రైస్ తినం' అని ముందు గానే చెప్పేస్తారు. దీనివల్ల ఎంత సుఖమో చూడండి. ఆహార పదార్థాలు దండగ లేక పోవడం సంగతి అటుంచి వండిన గృహిణికి ప్రాణం ఉసూరు మనదు.

అలవాట్లు మారినప్పుడు ఆదరణ చూపే విధానం కూడా మారక తప్పదు. 'మా రోజుల్లో ఇలాగే' అంటూ ఈ రోజుల్లో సెనగలు ఒళ్ళోపోస్తే పేరం టాని కెంతమంది రారు! ఈ రోజు ఈ పేరంటాలు, భోజనాలు, అన్నీ కూడా సరదాగా స్నేహితులంతా కలుసు కుందుకు మాత్రమే ఎక్కువగా ఉపయోగ పడుతున్నాయి. ఈ సంగతి మరిచిపోతే ఎలా?

తమ యింటికి చిన్నపిల్లలు వస్తే చాలు వాళ్ళకి చాక్లెట్లు బిస్కట్లు పెద్ద వాళ్ళతో టిఫీను, కాఫీలు అన్నిపెట్టి తినిపిస్తాం. కాని మనపిల్లలకి అలాగే పెడతామా అని ఆలోచించరు. అదే వచ్చిన చిక్కు. ఆలోచిస్తే పైపిల్లలనీ మన పిల్లలాగే చూస్తాం. 'ఎక్కువ బిస్కట్లు అజీర్ణం అని, ఎక్కువతీపి మంచిదికాదనీ' అవి ఒకటీ అరా పెట్టి ఊరుకుంటాం. అంతమాత్రంచేత ఆపిల్లతల్లి ఏదో అనుకుంటుందని మొహమాటపడ నక్కర లేదు.

'మాయింట్లో పేవుడు లేందే జరగదు' అంటూ పిల్లలమీదా, భర్తమీదా ప్రేమతో, ఆదరణ ఒలకపోస్తూ రోజూ వేపుడు కూరలే పెట్టే గృహిణి నిజంగా ఆదరణ పేరుతో వారి ఆరోగ్యాలు గాలికి వదిలే స్తుంది! ఒంటికి ఏది మంచిదన్నది కూడా చూడని గృహిణి ఎంత ఆదరణతో వంటకాలు వడ్డించినా అవన్నీ బూడిద పోసిన పన్నీరే. ఆహారంలో మన శరీర పోషణకు కావలసినవన్నీ ఉన్నవి. రోజూ తింటున్నామా లేదా ? అని ఆలోచించి సయించని వారిచేతకూడా తినిపించకల్గడం నిజమైన ఆదరణగాని, బంగాళదుంపలు, చారు ఇష్టం అని అవే రోజూ చేస్తే ఏంగాను ?

ఆదరణ పేరుతో అనారోగ్యానికి దారి తీసే అలవాట్లు చాలా చేస్తూ ఉంటారు తల్లులు. రకరకాల ఆహార పదార్థాలు పిల్లలు తినడానికి అలవాటు పడాలి. అంతేగాని 'మా పిల్లలకి గోధుమ చూస్తే అసహ్యం' అని గొప్పగా చెప్పుకోవడం, ఆ గోధుమ తన వారి చేత తినిపించ లేక పోయిన గృహిణి చేతకాని తనాన్ని చెప్పక చెప్పడమే అవుతుంది.

ఆదరణతో పెట్టే భోజనం క్రమ బద్ధంగా ఉండకూడదని ఎక్కడా లేదు. వాళ్ళకిష్టమైనవి పెడితేనే ఆదరణ లేకుంటే లేదు అనుకోవడం అవివేకం. ఒంటికి మంచిది, ఆరోగ్యానికి అవసరం అయిన పదార్థాలు తల్లి ఎంత వేరు అయిన ఆదరణతో వడ్డించాలంటే—అవి పిల్లలూ పెద్దలూ కూడా పంచ భక్ష్య పరమాన్నాల వలె తినగలగాలి. అది ఆదరణకు నిర్వచనంగాని పటాటోపం ఆదరణ అనిపించుకోదు.

—కె. రామలక్ష్మి

# డాక్టర్ కబుర్లు

## పొగతాగినవారికి చిట్కా

బాగా పొగతాగేవారి దేహంలో చక్కెర తగ్గిపోతుంది ఎందుకో తెలియకుండా అలిసిపోతారు వారు.

అందుకనే మీకు పొగతాగే అలవాటు ఉంటే పంచదార బిళ్ళ ఏదయినా చప్పరించటం మంచిది త్వరగా నమిలి మింగకుండా చప్పరించటం మంచిది.

లేదా పొగతాగటం ఆపటం మంచిది! (కనీసం తగ్గించవచ్చు.)

కొందరికి పొగాకు అసలే పడదు. అటువంటివారు తీసి తిన్నా లాభంలేదు. కొంతకాలం పొగతాగటం ఆపి గుణం ఇస్తున్నదీ లేందీ చూడాలి.

ఇంకా అలసటగా ఉంటే డాక్టరు ఉండనే ఉన్నాడు!



హెచ్. ఎల్. హెర్ట్స్‌సోన్

(కాపీరయిటు)

శ్రీమతి యం. సత్యవతి

# టొమేటోలతో వివిధ రకాలు

## టొమేటోలతో పచ్చడి

కావలసిన వస్తువులు :

పావు కిలో — టొమాటో
2 — పచ్చిమిరపకాయలు
5, 6 — ఎండుమిరపకాయలు
అర్ధ టీ స్పూను — ధనియాలు
పావు టీ స్పూను — జీలకర్ర
పావు టీ స్పూను — ఆవాలు
శెనగబద్దంత — ఇంగువ
[1 టీ స్పూను — శెనగపప్పు
అర్ధ టీ స్పూను — మినపప్పు
ఉంటే వేయవచ్చు. వేయకున్నా ఫరవాలేదు]
చిటికెడు — పసుపు
తగినంత — ఉప్పు
కొంచెము — కరివేపాకు

చేయు విధము : టొమాటాలను శుభ్రముగా కడిగి తరుగవలయును. గిన్నె లేక మూకుడులో ఒక టీ స్పూను నూనె వేసి ఆవాలు వేసి చిటపట లాడివాక ఇంగువ, శెనగపప్పు, మినపప్పు, ఎండుమిరపకాయలు కూడ వేసి వేగనీయవలెను. వానిని తీసి మరల కొంచెము నూనెవేసి ధనియాలు, జీలకర్రను కూడ వేయించి, పచ్చిమిర్చిని, కరివేపాకును కూడ వేసి మరి యొక నిముషముంచి తీయవలెను. అదే గిన్నె (లేక మూకుడు)లో ఇంకొంచెము నూనె వేసి తరిగిన టమాటో ముక్కలను కూడ వేసి 5 నిముషములు మగ్గనీయవలెను. రోటిలో ముందుగ పోపును మెత్తగ నూరిన తరువాత, ఉప్పు, పసుపు కూడ వేసి, టమాటా ముక్కలను కూడ వేసి మెత్తగా (జాగ్రత్తగా కళ్లలో పడకుండా) నూరవలెను. ఈ పచ్చడి రెండురోజు లుండును.




## టొమాటో చారు

కావలసిన వస్తువులు :

టమాటాలు : పావు కిలో
ధనియాలు : టీ స్పూను
జీలకర్ర : అర్ధ టీ స్పూను
మిరియాలు : 6, 7
ఉప్పు : తగినంత
ఇంగువ : కొంచెము
పసుపు : చిటికెడు
కరివేపాకు, కొత్తిమీర : కొంచెము (సువాసనకొరకు)

చేయు విధము—

బాగుగా పండిన ఎఱ్ఱగానున్న టొమాటోలను తీసికొని శుభ్రముగా కడిగి, తరిగి ఒక గ్లాసు నీళ్లు పోసి ఉడుకబెట్టవలయును. ముక్కలు మెత్తగా ఉడికినతరువాత, ఉడుకబెట్టినదానిని 10 ని॥ చల్లార్చి గరిటతో గాని చేతితోగాని మెత్తగా మెదిపి రసము తీయవలెను. తొక్కలను తీసివేయవలెను. ఉడికించిన కందిపప్పు పై నీరును (పప్పు కట్టు)ను కూడ, టమాట నీటిలోవేసి అంతా చిన్న గిన్నెడు (మూడు గ్లాసులు) అగునట్లు వేసి, దానిలో తగినంత ఉప్పు, పసుపు వేసి మూతపెట్టి మసలనీయవలెను. ధనియాలు, జీలకర్ర వేయించి వానిలో మిరియాలు కూడ వేసి (మిరియాలను వేయించనక్కరలేదు) పొడి దంచవలెను. చారు బాగుగ మరుగుచున్నప్పుడు కొత్తిమీర, కరివేపాకు వేసి, ధనియాలు మొ॥వాని పొడి కూడవేసి మరి రెండు నిముషములు మసలనీయవలెను. అర్ధ టీ స్పూను నూనెలో ఇంగువ, ఆవాలు, 1 ఎండు మిరపకాయ వేసి పోపు వేయించి, మసిలే చారులో కలుపవలెను. ఈ చారును రోగులకు కూడ వాడవచ్చును.

# టొమాటో ఊరుగాయ

**కావలసిన వస్తువులు :**

దోరగానున్న టమాటాలు : 1 కిలో
చింతపండు : పావు కిలో
ఉప్పు — 1¼ పావు (తూకము కాక పావు శేరు గ్లాసుతో కొలిచి)
కారంపొడి — 300 గ్రాములు
పసుపు — 1 టీ స్పూను
మెంతులు — 1 టేబిలు స్పూను
ధనియాలు — 1 టేబిలు స్పూను
జీలకర్ర — 1 టీ స్పూను
ఆవాలు — 1 టీ స్పూను
ఇంగువ — కుంకుడుగింజంత (ఇష్టము కానివారు పోపుతో ఆవాలకు బదులు అల్లము, వెల్లిగడ్డ వాడవచ్చును.)
నూనె — 150 గ్రాములు (150 గ్రా.)
కరివేపాకు — కొంచెము.

**చేయువిధము :**

ఊరుగాయ పెట్టుకునే జాడీని శుభ్రముగా కడగి, తేమలేకుండునట్లు తుడిచి ఎండలో పెట్టవలెను. చింతపండులో గింజలు, తొక్కలు, ఈనెలు మొ॥నవి లేకుండా శుభ్రము చేసియుంచవలెను. ఉప్పు మెత్తగా కాకున్నా రాళ్ళుగా యుండకుండా కొంచెము దంచి యుంచుకొనవలెను.

దోరగా నున్న టమాటాలను శుభ్రముగా కడిగి తడిలేకుండునట్లు మంచి గుడ్డతో తుడిచియుంచవలెను. టమాటాలను తుడిచినవానిని పొడుగుగా యుండునట్లు తగు సైజులో తరుగవలెను. టమాట ముక్కలలో ఉప్పు, పసుపు వేసి జాడీలో వేసి మధ్య మధ్య చింతపండును కూడ వేసి రెండు రోజులు ఊరనీయవలెను ప్రతిదినము తడి లేకుండ ఉన్న గరిటతో కలియబెట్ట వలయును.

మూడవరోజున టమాట ముక్కలను, చింతపండును వేరుచేయవలెను. వేరుచేసిన టమాట ముక్కలను మూడురోజులు బాగుగ ఎండనీయవలెను. ఈ మూడురోజులు చింతపండును జాడీలోనే యుంచవలెను. ఊరుగాయ కలిపేరోజున టమాట రసములో ఊరిన చింతపండును తీసి రోటిలో వేసి మెత్తగ రుబ్బి, రసమును తీసి, పనికిరాని దానిని పారవేయవలెను. ఈ రసమును జాడీలో ఉంచి 1 గంటసేపు ఎండలో నుంచవలెను. మెంతులు, ధనియాలు, జీలకర్ర వేనికవే వేరువేరుగ దంచి పొడివేసి ఉంచవలెను.

రుబ్బియుంచిన రసములో కారము, దంపియుంచిన పొడులను కలిపి టమాటా ముక్కలను కూడ వేసి బాగుగా కలుపవలయును. మూకుడులో నూనెవేసి బాగుగా మసలనిచ్చి ఇంగువను (పొడిచేసి) ఆవాలు, జీలకర్ర కొంచెము వేసి చిటపట లాడినాక 2 ఎండుమిరపకాయల ముక్కలు, కరివేపాకు కూడ వేసి నూనెను దించవలయును. నూనె బాగా చల్లగా అయిన తరువాత ఊరుగాయలో ఈ పోపు చేసిన నూనెను వేసి బాగుగా కలియబెట్టవలెను. రెండురోజులైన తర్వాత మరల యింకొకసారి పొడిగానున్న గరిటెతో కలియబెట్టవలెను. ఈ ఊరుగాయ 6 నెలలవరకు నిలువయుండును.

# సాలడ్

**కావలసిన వస్తువులు :**

పెద్ద టమాట — 1
పెద్ద ఉల్లిగడ్డ — 1
సూరిన ఉప్పు — అర్ధ టీ స్పూను (రుచికొరకు)
కొత్తిమీర — కొంచెము (అలంకరణకొరకు)

**చేయువిధము :**

ఎర్రగా మంచిగా నున్న టమాటోను, ఉల్లిగడ్డను పై పొట్టుతీసి దానిని బాగుగ కడుగవలెను. ఉల్లిగడ్డను, టమాటాను కూడ అడ్డములో గుండ్రముగ బిళ్లలు వచ్చునట్లు (ఆలుగడ్డ బజ్జీలకు తరిగినట్లు) సన్నగా తరుగవలెను. ఒక సాసరులో గాని స్టీలు పళ్లెములోగాని ఈ తరిగి యుంచిన టమాటా మరియు ఉల్లిగడ్డ ముక్కలను క్రమముగా పేర్చి ఉప్పు చల్లవలయును. కడిగియుంచిన కొత్తిమీర ఆకులను కూడ వేయవలెను. భోజనము 5 ని॥లకు చేయుటురనగా దీనిని తయారుగా పెట్టుకొనవలయును.



రిక్షా వాళ్ళెవరో 'శుక్రుడి' యింట దిగినప్పటినుంచి - నాకు శుక్రదశ పోయింది..ప్చ్ !!




# అవతారాల అంతర్యం



# ధర్మపథం

బులుసు వెంకటరమణయ్య

అణువు మొదలుకొని బ్రహ్మాండం వరకూ ఉన్న అన్ని వస్తువులలోనూ, పిపీలికాది బ్రహ్మ పర్యంతం వున్న సమస్త ప్రాణికోటి లోనూ భగవంతుడు వ్యాప్తమై ఉన్నాడు.

ఇది సర్వసాధారణంగా చెప్పుకునేసంగతి!

అయినా ప్రాణుల్లో పరస్పర కలహాలూ అన్యాయాలు సంభవించేటప్పుడు న్యాయం జరపడానికి అవతారాలు ఎత్తడం జరుగుతుందని భగవానుడే గీతలో చెప్పి ఉన్నాడు!

భగవంతుడు ఎత్తిన అవతారాలు చాలా ఉన్నా, వాటిలో 'దశావతారాలు' అని పదింటికి మాత్రమే ప్రఖ్యాతి కలిగింది. అవి

మత్స్యః కూర్మో వరాహశ్చ
నారసింహశ్చ వామనః
రామో రామశ్చ రామశ్చ
బౌద్ధః కలికి రేవచ —

అనే శ్లోకంలో వివరించబడ్డాయి.

ప్రతీ అవతారానికీ ఒక పరమ ప్రయోజనం వున్నది. అనితర సాధ్యమైన ఒక మహా కార్యం ప్రతీ అవతారానికి ప్రధానం. మత్స్యావతారం ఎత్తినప్పుడు భగవంతుడు సముద్రంలో దాగి వుండిన సోమకుడనే రాక్షసుని చంపి, అతను అపహరించిన వేదాలను తిరిగి బ్రహ్మదేవుడికి సమర్పించాడు. కూర్మావతారంలో క్షీర సాగరంలో మంధరాద్రిని తన వీపుపైని మోసి, సముద్ర మథనానికి మిక్కిలి సహకరించాడు. ఇలాగే వరహావతారంలో హిరణ్యాక్షవధ, నరసింహావతారంలో హిరణ్యకశిపుని సంహారం, వామనావతారంలో బలిచక్రవర్తిని పాతాళానికి అణగద్రొక్కడం—ఈ మొదలైనవి సుప్రసిద్ధంగానే ఉన్నవి!

వీటివల్ల ఒక విశేషం కూడా తెలుస్తూ వున్నది. ఈ అవతారక్రమం సృష్టి క్రమ పద్ధతిని బోధిస్తున్నది.

సృష్టిలో మొదటిది నీరు. 'అప ఏవ ససర్జాదౌ' అంటే — మొదట నీటినే దేవుడు సృష్టించాడు— అనే శాస్త్ర వాక్యం ఉన్నది. భగవంతుడికి 'నారాయణుడు' అనే పేరు దీని మూలంగా వచ్చిందట. నారం అంటే నీరు. అది ఆయనంగా — స్థానంగా కలవాడు — జలధిశయనుడు కావడంవల్ల నారాయణుడయ్యాడు. అందువల్లనే మొదట నీటిలో నివసించే మాత్స్యం అవతరించినది. క్రమేణా భూమికూడా కొంత ఏర్పడడంవల్ల జలములలోనూ, స్థలముపైనీ చరించే కూర్మం యొక్క సృష్టి ఏర్పడినది. క్రమంగా బాడి నేలలు ఏర్పడ్డాయి— అక్కడక్కడ నీరు ఇంకిపోతూ. దానికి అనురూపమైన ప్రాణి పంది కావడంవల్ల వరాహావతారం ఏర్పడింది.

ప్రాణుల్లో మొదటిది జంతువులు మున్నగు మానవేతరాల సృష్టి. అటుపిమ్మట కిన్నరులు, కింపురుషులు మున్నగువారు సృజింపబడ్డారు వీరి శరీరంలో సగంభాగం మనుష్యుడికీ, సగంభాగం మృగానికీ చెంది వుంటుంది. అట్టి సృష్టికి చెందినదే నరసింహావతారం! ఆ రూపంతో ఆవిర్భవించిన విష్ణువు భక్తుడైన ప్రహ్లాదుణ్ణి రక్షించిన గాథ అందరికీ తెలిసినదే.దా!

తర్వాతిది మొదటి మానవుని సృష్టి ఆదిలో మానవులు చాలా పొట్టిగా వుండే వారనీ, క్రమంగా వారిలో మార్పు కలిగిందనీ దీనివల్ల తెలుస్తున్నది.

మానవుల సృష్టి జరిగిన తర్వాత వారిలో బలవంతులు కొందరూ, బలహీనులు కొందరూ ఉండడం స్వాభావికం! బలవంతులు న్యాయా న్యాయాలనూ, ధర్మా ధర్మాలనూ గణించక బలహీనులను బాధిస్తూ వుండగా, దుష్టులైన ఆ బలవంతులను అణచివేసి, బలహీనులను రక్షించడానికయి భార్గవ రాముడు, శ్రీరాముడు మొదలైన మహా వీరులుగా విష్ణువు అవతరించడం జరిగింది.

అవతారగాథలవల్ల మనకు సృష్టిక్రమం కూడా ఈ విధంగా తెలియజేయబడుతున్నది. ●





# మంచు కరిగినవేళ మమత నవ్వింది

శ్రీమతి వేదుల శకుంతల

గంగాధర్

శ్రీకారం చుట్టుకున్న అరచేయి కళ్ల కద్దుకుని, గట్టిగ ఆవలించి లేచి కూర్చున్నారు రంగనాథం మేష్టారు. ఆయన మంచం కిటికీ ప్రక్కగ వుంటుంది. తెల్లగ తోమిన కంచు మరచెంబు దానిమీద మట్టుగ్లాసు బోర్లించి, కిటికీలో ఆయనకి అందేట్టుగ వుంటుంది. రాత్రివేళ దాహం వేస్తే చేతికి అందే మరచెంబు ఎత్తి గడగడ నీళ్లన్ని త్రాగేసి నిద్రపట్టేవరకు తలగడ క్రిందవున్న విసనకర్రతో విసురుకోవటం ఆయనకి జీర్ణించుకుపోయిన అలవాట్లు. మరీ వేసంకాలంలో తప్ప ఆయన ఆ గది వదలి బైట పడుకోరు. ఆరు బైట గాలి ఆయన తత్వానికి సరిపడదు. తనకి సరిపడని పనులు సాగపోటుపైన ఆయన చేయరు. మరొకరు చేసినా సహించరు. ఆయన సంగతి అందరికీ తెలును. రంగనాథం మేష్టారి పట్టుదల, శాంతం బడిలోనూ జరిగితీరాల్సిందే! అయితే అన్నీ తెలుసుండీ ఆయన ఇష్టానికి వ్యతిరేకంగ ప్రవర్తించి, ఎదురించినవాడు గర్భవాసాన్న పుట్టిన కొడుకే కావటం— ఆయనకి తీరని బాధని కల్గించింది!

మసక వెలుతురులో ఎదురింటి సీతారామమ్మ వాకిట్లో పెడుతున్న ముగ్గులు, తెల్లగ మల్లెలు వెదజల్లినట్టు, అంతక్రంటే అందంగ—ఆమె ప్రక్కనే నుంచున్న మనమడు రఘు బామ్మకొంగు పట్టుకుని, ఆమె వంచినప్పుడల్లా తనూ నడుం వంచుతు నానా అవస్థపడటం—కనిపిస్తోంది. 'ఎందుకురా వెధవాయ్ వెళ్లి పడుకోరాదూ?' కసురుకున్నది సీతారామమ్మ. కొంగు లాగుతూ వుంటే చుక్కలు సరిగా కుదరటంలేదని. 'నే వెళ్లను. మరేమో మజ్జిగచేసి వెన్నంతా చట్టిలో దాచేసేవుగ నిన్న. ఇవాళ అంతా నాకు పెట్టాల్సిందే'

'ఓరి నీ అసాధ్యం గూల. అలాగే లేరా వెళ్లి మీ తాతయ్య దగ్గర పద్యాల చెప్పించుకుంటూ వుండు. అంతలో ముగ్గుల పెట్టేసివస్తాను' అరచేతిలో ముగ్గు తాలిస్తు అన్నది. 'ఉహూ...మరి తాతయ్య చుట్ట త్రాగి చెప్తానన్నాడు.' ముద్దుగ గునుస్తూ బామ్మ పెట్టుతున్న ముగ్గులు త్రొక్కేస్తు వుంటే వీధి అరుగుమీదకి వచ్చిన తాతయ్య 'ఒరేయి యిలా రారా! వెధవ చుట్ట అంటుకోవటంలేదుగాని, మనం పద్యాలు చెప్పుకుందామురా' అన్నాడు అరుగుమీద చతికిల పటూ.

మంచంమీద బాసినపట్టేసుకుని కూర్చున్న రంగనాథం మేష్టారికి నేత్రానందకరంగ వున్నది ఆ దృశ్యం. 'తాతయ్య మనమడు' ఈ అనుభూతి క్రొత్తగ వున్నది. మునుపెన్నడు ఎరగని పరవశం కలిగి గిలిగింతలు పెడ్తోంది. తాను ఎంతమందికి చదువులు చెప్పలేదూ, డిక్టేషన్‌లో తప్పులు రాస్తే పదేసిసార్లు రాయించటం— క్లాసులో అల్లరిచేస్తే ఇంపోజిషన్ రాసి తెమ్మనటం— పద్యాలు కంఠస్థం చేయకపోతే గోడకుర్చీలు, జవాబులు రాయకపోతే బెత్తం దెబ్బలు! ఎన్నెన్ని శిక్షలువేసి దార్లో పెట్టలేదూ?

ఈనాడు తనదగ్గర చదువుకున్న వాళ్ళు పెద్దపెద్ద పదవుల్లో వున్నా తనని ఎంత భయభక్తులతో చూస్తారని?... అలాంటిది స్వంతకొడుకైన వాడు తన రక్తం పంచుకుని పుట్టినవాడు ప్రసాదు తను ఇష్టపడకపోయినా తనని వదలి ప్రేమించిన అమ్మాయిని చేసుకుని వెళ్ళిపోతాడా? వాడూ ఒక కొడుకేనా? తల్లి ఎంత బాధపడ్డదో వాడి కళ్ళకేకపోయాక వాడు బ్రతికినా చచ్చినా ఒకటే ననిపించింది. పరాయి పిల్లలపాటి భయభక్తులు వాడికి లేకపోతే తనేనా అంత తక్కువ? 'ఫో ఇంట్లోంచి' అనేసేడు. భార్య ఎంత గోల పెట్టిందని? కాని తను కరుగలేదు. పైగా ఏమన్నాడూ? 'ఇదిగో చూడు వాడు నిజంగ కొడుకే అయితే మనల్ని కాదని ఆ పిల్లని చేసుకుందుకు పోతాడా? ఏనాటి బాకీయో అనుకో. వీళ్లంతా మన పిల్లలే, నా శిష్యులందరూ మన బిడ్డలేనే!' అని గంభీరంగ పలుకుతున్నప్పుడు ఎదురు చెప్పే ధైర్యం లేని లక్ష్మమ్మ బాధనంతా గొంతుకలో దిగమింగుకుని 'నా బాధ మీకు అర్థంగాదు. కన్నకడుపు తీపి పరాయి పిల్లల మీద ఉంటుందా? మీరు కరగలేని, కరుడు మనసు కలవారు.నా ఆవేదన మీరు తెలుసుకోలేరు' అని కృళ్లికృళ్లి ఏడ్చింది

మంచులా బిగుసుకున్నారేగాని ఆవంతైనా కరగలేదు మేష్టారు. భార్యదగ్గర ఎన్నడూ కొడుకు ప్రస్తావన తేలేదు. ఆ నోట ఆ నోట వాళ్లను గురించిన వార్తలు వింటున్నా ఆయనలో మార్పు రాలేదు. మనమడు పుట్టేడన్న వార్త వినికూడా ఆయన నిర్లిప్తతగావే వుండిపోవడం లక్ష్మమ్మకి కత్తిపోటుకంటే ఎక్కువే అయింది 'ఈయన మనిషికాదు. రాయి' అనుకున్నది. స్కూలు పిల్లలు— కాంపోజిషన్ పుస్తకాలు దిద్దుకోవటం, నోట్సులు రాసుకోవటం— అంతే ఆ ప్రవాహంలో కొట్టుకుపోతు ఒకచోట తక్కున ఆగిపోయేరు. అదే ఆయన 'రిటైర్' అవడం. ఒక్కసారి నడుం విరిగినట్టు విలవిల లాడిపోయేరు. ఎక్కడలేని తీరుబడి ఏం తోచదు. ఒంటరితనం. బావురుమంటున్న ఇంట్లో, మట్టిబొమ్మలా తనూ, భార్య!

ఎదురింట్లో కలకల లాడుతూ కొడుకులు కోడలు మనమలు, తమని వెక్కిరిస్తున్నట్టు, జాలిపడుతున్నట్టు:

'తాతయ్యా, పద్యాలు చాలుగాని వేపమండ విరు. ముఖం కడుక్కుందాం. బామ్మ అప్పుడే మజ్జిగ చేసేస్తోంది '

'ఓరి పిడుగా! నీ దృష్టి అంతా అటే వుందిరా?' ఒడిలోనుంచి పరిగెట్టిపోతున్న మనమణ్ణి చూస్తూ నెరసిన మీసాలు ఊగుతుండేటట్టు నవ్వుతున్న తాతయ్యని చూసి రంగనాథం మేష్టారు క్షణం పాటు మరిచిపోయేరు.

'చెంబు నీళ్లు అరుగుమీద పెట్టేను. ముఖం కడుక్కోండి కాఫీ తాగుదురుగాని' గుమ్మం దగ్గరనుంచి కేకేసి వంటింట్లోకి వెళ్లిపోయింది. యంత్రంలా దినచర్యలన్నీ చేసుకోవటం అలవాటైపోయిన లక్ష్మమ్మని అలా చూస్తూ మొదటిసారిగ బాధపడ్డారు

'సీతారామమ్మగా మనమడి ముద్దుముచ్చట్లకి, అల్లర్లకి నోచుకోలేదు 'అత్తయ్యా' అనే పిలుపుకి దూరమైంది. మరబొమ్మలా ఆ వంటింట్లో పనులు చేసుకోవటమేగాని 'మీరుండండి ఆ పని నేను చేస్తాను' అనే కోడలి ఆదరణకి కరువైందిగదా! తను మాత్రం? ఇంతకాలం స్కూలు పిల్లలు, తోడివంతుళ్ళు, ఇన్స్పెక్షన్లు ఈ గొడవలతో కాలమే తెలియలేదు. ఇప్పుడో తన అవసరం తీరింది, అందరికీ! ఏమిటో వెలితి—బాధ, ఒంటరితనం' 'తాతయ్యా' అనే మనమడు వుండీ లేనట్టు చేసుకున్నాను రఘు ఈడే కాబోలు వాడికీ! వాడు ఇలాగే తెల్లవారకట్ల లేచి వాళ్లమ్మ నాన్నని తాతయ్యా పద్యాలు చెప్పమంటాడేమో? ఆ ముసలాడు సరిగా చెప్తాడా? ఏదో ఆఫీసులో పనిట. ఎంతైనా పంతులు చెప్పినట్టు చెప్పగలడా? అపస్వరాలు చెప్తే... తల్చుకుంటేనే ప్రాణం గిలగిల లాడుతోంది. తను ఎంతమందికి విద్యాదానం చేయలేదూ? స్వంత మనమడిని ఒడిలో కూర్చోబెట్టుకుని మనసారా ఆనందిస్తూ తన విద్యాధనాన్నంతా ఇవ్వలేకపోతున్నాను. ఊహూ వీల్లేదు వాడిని అలా వదిలివేయలేను. తాతయ్యా అనిపించుకుని ఒక్కసారి వీపుమీద ఎక్కించుకోవాలి...' 'అదేమిటీ అలా కూర్చున్నారు? మనసు బాగాలేదా? ఆ నీళ్లేమిటీ కళ్లకి?' కాఫీ గ్లాసు అందిస్తూ పీటమీద దిగాలుగా కూర్చున్న భర్తని చూసి విస్తుపోయింది.

'ఆ!...అహ...ఆ ఏంలేదు. మా స్నేహితుడు గుర్తుకొచ్చేడు, అంతే! సరేగాని ఇవాళ సాయంత్రం బస్సులో వెళ్లి రేపు సాయంత్రానికి వచ్చేస్తాను ఉండగలవా? లేకపోతే వాళ్ల రఘును వాడి చెల్లిని రేపంతా మనింట్లోనే వుంచుకో.' పంచకొసతో కళ్ల నీళ్లు తుడుచుకుంటు కంగారుగ అన్నారు మేష్టారు.

'సరిపోయింది. వాళ్లు మనింట్లో వుంటారా? రఘుకి తాత పక్కలోగాని నిద్దే పట్టదు. వాడి చెల్లికి బామ్మ చంకగాని పనికిరాదు. ఆ చంటిపిల్లమటుకు ఇంకా వాళ్లమ్మదగ్గరుంటుందిగాని కొన్నాళ్లయితే అదీ తాత వీపో బామ్మ మెడో పట్టుకోదూ? సరేలెండి నే నెలాగో వుంటాను. పగలంతా ఒంటరిగ వుండటం ఎలాగు అలవాటే! రాత్రి ఏదో రామస్మరణ చేసుకుంటూ లేదా పనిమనిషి రంగమ్మని పిలిపించుకుంటాను.'

మేష్టారు మరేం మాట్లాడలేకపోయారు.

* * *

'అమ్మాయి తలుపు తీయమ్మా'

ఎడ్రసు తెలుసుకుని ఇల్లు వెదకి పట్టుకుని తలుపుమీద చేయి వేయబోయేటప్పుడు చేయి వణికింది కాళ్లు వణికేయి, ఏదో చేయరాని పని చేస్తున్నట్లు గుండె వేగం హెచ్చింది. వెనుదిరిగి 'వెళ్లిపోదామా' అనుకున్నారు. ఎన్నడు ముఖమైనా చూడని కోడలిని ఎలా పల్కరించాలా అనుకున్నారు. నిరసనగ చూస్తుందేమో? ఈసడిస్తుందేమో?...కాసేపు నేను మాత్రం వాళ్లకోసం వచ్చానా? ఆ పసివాడికోసం వచ్చాను చూస్తాను వెళ్లిపోతాను. వీలైతే వెంట తీసుకెళ్లిపోతాను. ఆ! అంతే!! వాళ్లతో నాకేం పని? గుండె చిక్కపట్టుకుని బింకంగ మెట్లెక్కి గంభీరంగ తలుపు తట్టేరు.

'ఎవరూ?' తలుపు తెరచి 'ఎవరికోసం?' అన్నది రాధ. అపరిచితవ్యక్తిని పరిశీలిస్తూ.

'నేను...నేను.. ప్రసాదు ఇల్లు ఇదేనా?' ఎంత బిగుసుకున్నప్పటికీ రాధ ముఖం చూడగానే కంగారు పడక తప్పలేదు మేష్టారుకి.

'ఆ ఇదే మీరు ఏం పనిమీద వచ్చారో ఈ రాత్రిపూట? వారు కాంపు వెళ్లారు. రేపుగాని రారు...ఆఫీసు పనిమీద వచ్చారా

# మంచు కరిగిన వేళ...

మీారు?'

ప్రసాదుకోసం చాలామంది వచ్చిపోతూ వుంటారు ఆఫీసు పనిమీద. ఆ బాపతేమో అనుకున్నది. అయితే చేతిలో సంచీ అదీ చూసి, సంశయంతోనే అడిగింది.

కలుక్కుమన్నది మేష్టారి హృదయం 'తాను ఆఫీసు పనిమీద వచ్చిన పరాయి వాడా?' అంతలోనే సర్దుకున్నారు. అబ్బాయి వూళ్ళో లేడని తెలుసుకుని అంతరంలో ఏదో తృప్తి ననుభవించారు. వాడి కళ్ళ పడకుండా పోవచ్చునని!

'కాదమ్మాయి నేను ప్రసాదుకి పెద్ద తండ్రిని ఏదీ రాకపోకలు లేకపోవడంనుంచి నేను నీకు తెలియదు. ఏమిటో బంధుత్వాలు మరుగునపడిపోతే కన్నవాళ్ళే గుర్తు తెలియదు. ఏదో ఊళ్ళోపనుండి వచ్చాను. చూసిపోదామని...'

'అయ్యో! అలాగా!! ఎంత మంచిరోజు రండి మామగారు లోపలికి రండి ఎన్నడూ చూడలేదు కదూ అందుకని ఎరగను క్షమించండి మనసు చిన్నబుచ్చుకున్నారేమో! లోపలకి రండి ఆ సంచీ ఇలా యివ్వండి కాళ్ళు కడుక్కోండి. వంట తయారుగానే వున్నది భోజనం చేద్దురుగాని.' ఆప్యాయం వేడికోలు, మన్నన అన్నీ మిళితమైన రాధ ముఖం చూసి చకితులయ్యారు అత్తవారి వైపు బంధువులు వస్తే ఇంత సంబరపడిపోయే కోడలని ఎప్పుడూ ఊహించలేదు అందునా ఎన్నడూ రాకపోకలు లేక పట్టుదలతో వున్నప్పుడు ఇలా ఏనుగెక్కినంత సంబరంగా హడావిడిపడుతున్న రాధని చూస్తే నిజంగానే ఆయన కడుపు నిండిపోయింది లోపలకి వచ్చి ముచ్చటగావున్న ఇల్లు కళకళలాడే కోడలి ముఖం చూసి మురిసిపోయేరు రంగనాథంగారు నలుమూలలా కలియ చూసి చటుక్కున అడిగేరు.

'అవును గాని బాబు ఏడమ్మా కనిపించడం? పేరేమిటీ?' 'వాడు ప్రయివేటుకు వెళ్ళాడు మామగారూ. ఈపాటికి వచ్చేస్తు వుండాలి ప్రక్క సందులోనే ఏమిటో ఆయనకి తీరుబడి వుండదు నా దగ్గర వీడికి భయం లేదు. అందుకని వాడిని ఇలా పరాయివాళ్ళదగ్గరకి ప్రయివేటుకి పంపించాల్సి వస్తోంది. వాళ్ళ తాతగారి పేరే రంగనాథం!'

'తాతగారి పేరు రంగనాథం!' మనసులో గొణుక్కున్నారు ఆనందం ఉబికిపోతోంది. 'అలాగ!' అనటం తప్ప మరేమి మాట్లాడ లేకపోతున్నారు.

'అవును మామగారూ. ఏమిటో పట్టుదలలకి అర్థం వుండదు. మా పెళ్ళిమూలంగా అటు కన్నవారికి ఇటు అత్తవారికి దూరమై అనురాగాలు, ఆదరాలు అన్న పదాలే మర్చిపోయాము. లేకపోతే వాడు అలా పరాయివాళ్ళదగ్గర చదువుకునే ఖర్మేమిటి చెప్పండి? తాతగారి విద్య ఎందరిని ఉద్ధరించలేదూ? స్వంత మనుమడై వుండి వీడు ఇలా పాకులాడవలసి వచ్చింది. ఆయనకి ఎన్నోసార్లు చెప్పాను మీరేనా పట్టుదల వదలి అత్తయ్య మామయ్యని తీసుకురండని. ఆయన వింటుంటేనా? నాన్నకి లేని ప్రేమ నా కెందుకుండాలీ అంటారు? కాని నాకు తెలుసు మామగారూ — స్త్రీ హృదయం ఎంత క్షోభిస్తుందో అత్తయ్య ఎంత పరితపిస్తున్నారో ...నేను వెళ్ళి తీసుకునివద్దామనుకున్నాను ఆయన ఒప్పుకోలేదు! పోనీ మా అమ్మనేనా చూసివస్తానంటే... మీా నాన్న కోసం తగ్గి వచ్చి తీసుకెళితే వెళ్ళుగాని అంతేగాని నీ అంతట నీవు వెళ్తే నే సహించను... అంటారు...' కళ్ళొత్తుకుంటున్న రాధని చూస్తుంటే రంగనాథంగారి మనసు ఆర్ద్రమైపోయింది ఇంతకాలం పుట్టింటివారి మద్దతు వుందనుకున్నాను గాని కొడుకు కోడలు దిక్కులేని పక్షుల్లా వున్నట్టు తెలియదు ఎంత ప్రారబ్ధం!

'అమ్మాయి నిజంగ మా వాడు...అదే మా తమ్ముడు ఎంత కఠినుడమ్మా? కొడుకు తన మాట వినలేదని పట్టుదలేగాని ముందు చూపులేని మనిషి. వట్టి మంకుపట్టు! మతిలేని మనిషా అని మతిలేని మనిషి!! భార్యని ఏడిపిస్తూ కొడుకు కోడలకి దూరమై ఏం బావుకు చద్దామని? ఏళ్ళు రాగావే సరా?...'

'మామగారూ!...వద్దు అంతలేసి మాట లనకండి ఎంతైనా ఆయన మాకు పూజ్యులు తండ్రిలాంటి వారు. ఏదో మా అదృష్టం ఇంతే అనుకుంటాము. ఇన్నాళ్ళకి రాకరాక వచ్చిన మిమ్మల్ని ఇలా కలత పెడుతున్నాను పాపిష్ఠిదాన్ని. లేవండి

## మంచు కరిగినవేళ...

భోజనం చేద్దురు గాని. అదుగో రంగడు వచ్చేసేడు. ఇద్దరికి వడ్డించేస్తాను.'

'అమ్మా! మరేం.. మరేం . అంటూ వచ్చేస్తూ ఆగి 'ఎవరమ్మా ఈ తాతగారు?' అన్నాడు కళ్లు చిట్లించి ఎక్కడా చూడ లేదే? అన్నట్టుగ. తనకు తెలుసున్న తాతల జాబితాలో ఈ తాత లేడే! కోమటికొట్టు గవరన్న తాత, — బడితోటమాలి వీరన్నతాత, ఇంకా పక్కమేడలో కాపురమున్న సీతాయ్ వాళ్ల ముక్కుపొడుం తాత, కూరగాయలు అమ్మే కోటయ్య తాత ఇంకా పోతే వేరు సెనక్కాయలమ్మే పాపన్న తాత - అప్పుడప్పుడు వచ్చే తత్వాలు పాడే తంబురతాత .. మరి ఈ తాత ఎవరబ్బా? దర్జాగ కుర్చీలో కూర్చున్నాడు అచ్చం బడిలో మేష్టారిలాగ...' ఆ చిన్నబుర్రలో జవాబు దొరకలేదు.

'ఈ తాతగారు మన తాతగారే బాబు. అంటే మీ నాన్నగార్కి పెద్ద నాన్న గారు'—అన్నది లత కళ్లనిండా వెలుగు నింపుకుని తనయుడివైపు చూస్తూ.

'రా బాబూ' రెండు చేతులుచాచి ఎన్నాళ్ల నుంచో ఎదురు చూస్తున్నట్టు, నాచిపోయి వున్నట్టు ఆశగ పిలిచారు రంగనాథంగారు. 'తాతగారూ' అంటూ ఆయన దగ్గరగవెళ్లి 'అయితే మా తాతగారు మీకు తమ్ముడా? ఆయన్నిక్కడికి తీసుకురండి లేకపోతే మనమే వెళ్దాం పదండి. మా నాన్నగారు వూరికి వెళ్లారుగా త్వరగ వెళ్లివచ్చేద్దాం...'

మేష్టారి కళ్లు అశ్రుపూరితాలయి కంఠం గద్గదమైపోతోంది. 'అచ్చు అవే కళ్లు అదే ముక్కు. అచ్చు గుద్దినట్టు ప్రసాదు పోలికే! నాయనా ప్రసాదు ఎన్నాళ్లయిందిరా నిన్ను చూసి...' వళ్లు తెలియనంత గాఢంగ కౌగలించుకున్నారు మనమణ్ణి.

*   •   *

వద్దన్న కొలది దగ్గర కూర్చుని కొసిరి కొసిరి తినిపించిన కోడలి చేతి భోజనం — ఉత్సాహంగ స్కూలు విషయాలు చెప్తు పంక్తిని కూర్చున్న మనమడి ముద్దు మాటలు, రంగనాథంగార్ని ఉబ్బించేస్తున్నాయి. తను కొన్నివందలమంది పిల్లలకి విద్య ధారపోసేరు. అందులో కొంతమంది తనకెంతో అభిమాన పాత్రులు అయారు. కాని...కాని...రంగడు కొన్ని గంటల పరి







అనంతలక్ష్మి ప్రొడక్షన్స



# కాంభోజరాజుకథ



దర్శకత్వం: కె. కామేశ్వరరావు B.A.,

నిర్మాతలు: దగ్గుబాటి భాస్కరరావు B.A., కోసరాజు భానుప్రసాద్ M.A.B.L.,

శ్రీ ఫిలిమ్స్ రిలీజ్

మైసూర్: రేవతి ఎంటర్ ప్రైజెస్ (అరసికెరె)

యింట్లోనే ఇంత చేరువయ్యాడు. వీడి తర్వాతే మిగతావాళ్లంతా. ఈ మమత చెప్పలేనిది! ఆనాడు 'లక్ష్మి' అందుకే ఏడ్చింది. నాకు అర్థం కాదన్నది కాని అర్థమయింది. ఈ తీపిని వర్ణించేశక్తి నా వయస్సులో ఆర్జించలేకపోయేను. వీడిని వదలి ఎలా వెళ్లగలను?' పక్కలో పడుకున్న రంగడి బుగ్గ మృదువుగ నిమిరారు, తెల్లవారగట్ల మెలుకువ వచ్చిన మేష్టారు. ఆయనకి— అరుగుమీద తాతయ్య వడిలో కూర్చున్న రఘు మెదిలాడు.

ఆ రోజంతా తాత మనమలు బజారంతా తిరిగేరు. రంగడిని బడి మానిపించి మరీ త్రిప్పారు రంగనాథం మేష్టారు. పుస్తకాలు, బొమ్మలు, కొన్నారు. చీర రవికల గుడ్డ కొని పూలు పొట్లం కట్టించి ఇంటికి చేరేరు.

'ఎందుకు మామగారూ ఇవన్నీ?' అనవసరంగా డబ్బు ఖర్చుపెట్టారని నొచ్చుకున్నది రాధ.

'ఫర్వాలేదు అలా అనకమ్మా నేనే మీ మామగార్ని అయితే అలా అందువా? ఏదో నా ఆనందం! మళ్లీ సాయంత్రం వెళ్లిపోవాలి చీర కట్టుకో తల్లీ చూస్తాను.'

## మంచు కరిగిన వేళ...

అన్నారు హృదయమంతా నిండిన ఆనందంతో.

రాధ చీరకట్టుకుని మామగార్కి నమస్కరించింది. 'దీర్ఘ సుమంగళీభవ. నూరేళ్లు మీ దంపతులు, బాబు సుఖంగ వర్ధిల్లండి' తలమీద చేయివేసి మరీ దీవించారు 'మామగారూ, వీరు ఆయన వచ్చే దాక వుండండి. అసలు ఆయన కోప్పడుతారు గూడాను.' రాధ అన్నది 'అవును తాతయ్యా నువ్వు ఇప్పుడు వెళ్లడానికి వీల్లేదు' బాబు వంత పాడేడు మేష్టారుకీ వుండాలని అసలు అక్కడే వుండిపోవాలని... వున్నది కాని అవతల 'లక్ష్మి' ఒంటరిగ వుంది! అదీగాక ప్రసాదు తనని చూస్తే ...కోడలికి తెలిస్తే... 'ఊహూ ఇప్పుడు కాదమ్మా మళ్లా వస్తాలే' బాబుని వదల్లేక వెళ్లారు.

* * *

'ఇదేమిటే ఈ చీర ఎప్పుడు కొన్నావు? నాకు తెలియని కొత్తచీర నీకెక్కడిది?' ఇంట్లోకి రాగానే కొత్త చీరతో కనిపించిన లక్ష్మమ్మని చూస్తూ వింతగ అడిగేరు మేష్టారు.

'అవును ఈ చీర మీకు తెలియనిదే అంతే కాదు దని విలువా మీకు తెలియదు. భగవంతుడికి ఇన్నాళ్లకి నా మీద దయ గల్గింది మీరు నిన్న వూరికి వెళ్లగానే అబ్బాయి వచ్చాడు నా తండ్రి నన్ను చూసి ఎంత సంతోషపడ్డాడనీ? కడుపారా భోజనం తిని అమ్మా ఎప్పుడూ ఇలాగే నువ్వు నాకు దగ్గర కూర్చుని తినిపిస్తూ వుండాలమ్మా భగవంతుణ్ణి ఇలా ప్రార్థిస్తానమ్మా- అన్నాడు నా బంగారు నాయన! కొత్త చీర కొంగుతో కళ్లు వత్తుకున్నది

'ఆ!??—అబ్బాయి కొంపు వెళ్లలేవ? నాలాగే వాడుకూడా?.' ఆశ్చర్యంలో మునిగి స్వగతంలో అనుకోవలసిన మాటను పైకే అనేసేరు.

'ఏమిటే మీరనేది?! మీరు స్నేహితుణ్ణి చూడ్డానికి వెళ్లలేదూ?' లక్ష్మమ్మ ప్రశ్నకి జవాబు చెప్పకుండ ముఖమంతా ఆనందం పులుముకున్నట్లు నుంచున్నారు. ఎప్పుడూ గంభీరంగ బిర బిగుసుకునేట్టు వుండే రంగనాథం మేష్టారు; ఇంతకాలం అజ్ఞాతవాసం చేసినట్టు ఇక పైన చేయలేనట్టు అంతరంలో దాగిన మమత మాత్రం పెదాలచాటున ముసిముసిగ నవ్వింది.



'సుఖదుఃఖాలు'లో చంద్రమోహన్, వాణిశ్రీ.

**చిత్ర సమీక్ష :**

# సుఖదుఃఖాలు

ఒక కథని నేరుగా తెరకెక్కించడం కంటె, ఒకసారి తెరకెక్కిన చిత్రాన్ని మరో భాషలో పునర్నిర్మించడంలో కొంతసులువు లేకపోలేదు. కాని, కొన్ని విషయాలలో 'స్ట్రెయిట్' పిక్చరు కంటె ఎక్కువ జాగ్రత్తల్ని తీసుకోవడం అవసరమవుతుంది. ఒక భాషలో ఆ చిత్రం ఎలా, ఎందుకు, విజయవంత మైనది? అనే అంశం మీద నిశితంగా ఆలోచించాలి. తమ ప్రేక్షకుల అభిరుచి ననుసరించి మార్పులూ చేర్పులూ చేయడం అవసరం. ఈ విధమైన వివేకం శ్రీవిజయభట్ మూవీస్‌వారి 'సుఖదుఃఖాలు' చిత్రంలో కనిపిస్తుంది.

చట్టంలో హంతకుడిపై వున్న శిక్ష మీద, అతని మానసిక పరిస్థితి మీద, మానవత్వం మీద సుఖదుఃఖాలు చిత్రం ఒక పరిశీలన. ఒక రకమైన కనువిప్పు. హంతకుడు శిక్ష నుంచి తప్పించుకోలేడు. హంతకుడు ఆత్మహత్య చేసుకున్నప్పుడు అతనికి చట్టంలో ఎలాంటి స్థానమున్నది? అనే ప్రశ్నతో ముగించే ఈ కథ ఆద్యంతమూ మనోహరంగా వుంది.

రిటయిర్డ్ మేజర్ చంద్రకాంత్‌కి శ్రీకాంత్, రవికాంత్ ఇద్దరూ కొడుకులు. శ్రీకాంత్ పోలీసు ఇన్‌స్పెక్టరు. రవికాంత్ చదువుకుంటువ్నాడు. రవి వలలో పడిన రజిని మోసపోతుంది. బ్రతుకు బండలై ఆత్మహత్య చేసుకుంటుంది. ఆమె అన్న మోహన్ రవిని తలవని తలంపుగా హత్య చేస్తాడు. మేజర్ చంద్రకాంత్ మోహన్ వివరాలు తెలియకుండానే ఆశ్రయమిస్తాడు. వివరాలు తెలిసింతర్వాత క్షమిస్తాడు! పర్యవసానంగా మోహన్ ఆత్మహత్య చేసుకుంటాడు. 'యూసఫ్ సీతితో' అంతమయ్యే ఈ కథ ప్రేక్షకుల్ని బాగా ఆకట్టుకుంటుంది!

చిత్రం లోపరహితంగాను, చాకచక్యంగాను వుంది. దర్శకుని మెళుకువ మెచ్చుకోతగింది. హాస్యం పాలు తగ్గించి చిత్రానికి రసపుష్టి కలిగించినా, మాత్ర కని గమనించి వుండాల్సింది! రవికాంత్ హత్య జరగబోయేముందు మోహన్ 'కారణం' పేలవంగా వుంది. ఇక్కడ సన్నివేశానికి బలం చేకూర్చడానికి మాటలు ఎక్కువ తోడ్పడివుంటే బాగుండేది! కథ నడిచిన తీరులోను, నడిపించిన మార్గదర్శకత్వంలోను ప్రత్యేకత స్పష్టంగా కానవస్తుంది.

యస్. వి. రంగారావు మేజర్ చంద్రకాంత్ పాత్రని సజీవంగా ప్రేక్షకుల ముందుంచారు. అలాంటి పాత్రలని పోషించడంలో వారికి వారే సాటి అని నిరూపించుకున్నారు. ప్రేక్షకుల సానుభూతిని ఎక్కువగాచూరగొనేపాత్ర చంద్రమోహన్‌ది. మోహన్‌గా అతని నటన ప్రతిభావంతంగా వుంది. స్త్రీలని ఎక్కువగా రజని పాత్ర ఆకర్షిస్తుంది. రజనిగా వాణిశ్రీ నటన ప్రేక్షకుల మనస్సులో ముద్రవేస్తుంది. రవికాంత్‌గా హరనాథ్ చక్కని నటన ప్రదర్శించాడు. శ్రీకాంత్ పాత్రలో రామక్రిష్ణ నిండుగా నటించాడు. ఉచ్చారణకి తగిన నటనతో జయలలిత బాల పాత్రని బాగా పోషించింది. రమణారెడ్డి పాత్రలో కొత్తదనం లేకపోయినా నటనలో ఆ లోపం తీరింది. సూర్యకాంతావిది చిన్న పాత్రే అయినా నిలబడే నటనవే కనబరచారు. కోటీశ్వరరావు, సారథి, ఏకామ్రేశ్వరరావు మొదలైనవారు తక్కిన పాత్రల్ని పోషించి చిత్రానికి వన్నె తెచ్చారు.

యస్. పి. కోదండపాణి సంగీతం మధురంగా వుంది. 'మేడంటే మేడకాదు' 'ఇది మల్లెల వేళయని' పాటలు పంచదారలా వున్నాయి. ఘంటసాల, సుశీల, బాలసుబ్రహ్మణ్యం కంఠాలు భావాలకి మెరుగులు పెట్టాయి.

కె. బాలచందర్ రాసిన కథకి పాలగుమ్మి పద్మరాజు స్క్రీన్‌ప్లే, డైలాగులు రాశారు. దేవులపల్లి కృష్ణశాస్త్రి, కొసరాజు, ఆరుద్ర, నారాయణరెడ్డి పాటలు రాశారు. యమ్. కన్నప్ప కెమెరా వర్కు బాగున్నది. యన్. యస్. ప్రకాశరావు ఎడిటింగ్ చేశారు.

అయ్. యన్. మూర్తి దర్శకత్వంలో ఒక చక్కని కథాచిత్రాన్ని అందించిన నిర్మాతలు పి. ఏకామ్రేశ్వరరావు, యన్. యన్. భట్‌ల కృషి ప్రశంసనీయం. అసోసియేట్ ప్రొడ్యూసరు డా॥ హెచ్. పి. సుందర్. చమియా రిలీజ్

—సితరాజు ●

పార్వతీ పరమేశ్వరుల
అవతార లీలలను
అద్భుతముగా చిత్రించిన
అపూర్వ సృష్టి



విజయా వారి

# ఉమా చండీ గౌరీ శంకరుల కథ

నిర్మాత-దర్శకుడు:
కె.వి.రెడ్డి B.Sc., [Hons]



విజయ రిలీజ్

# సినిమా

'సుడిగుండాలు' షూటింగు మూడు షెడ్యూలులలో పూర్తి చేసారు దర్శక నిర్మాత శ్రీ ఆదుర్తి. అక్కినేని, ఆదుర్తి గార్ల కృషితో ఆంధ్రదేశ ప్రేక్షకులు ఒక చక్కటి ప్రయోజనాత్మక చిత్రాన్ని అతిత్వరలో చూడగలరు. ఈ చిత్రంలో నాగేశ్వరరావు ఒక రిటైర్డ్ జడ్జి పాత్రను అత్యంత ప్రతిభావంతంగా పోషించినట్లు శ్రీ ఆదుర్తి వ్యక్త పర్చారు.

**సినిమా తీయడానికి చీట్ల లాటరీ**

ఒక నెలక్రితం విఠలాచార్యను కలిసినప్పుడు కాంతారావుతో ఒక జానపదాన్ని నిర్మిస్తానని చెప్పారు. కానీ, యిప్పుడు ఆ ప్రయత్నాన్ని విరమించుకున్నారు. దీనికి కారణం మీకు తెలుసా? ఇది ఒక తమాషా కథ. జనవరి ఫస్టున మూడు చీటీలను వ్రాసి అందులో ఒకదాన్ని లాగి చూశారు. ఆ చీటిలో ఏముందో తెలుసా! ఎన్. టి. ఆర్. తో సోషల్ సబ్జెక్టు తియ్యమని వుంది. అందుకే శ్రీ విఠలాచార్య ఫిబ్రవరినుండి శ్రీ రామారావుతో ఒక చక్కటి కుటుంబగాథను నిర్మిస్తున్నారు. ఇది కాగానే రామారావు హీరోగ ఒక బ్రహ్మాండమయిన కలర్ జానపద చిత్రాన్ని నిర్మిస్తారు. ఇవిగాక మధ పిక్చర్సుకు, జగపతికి, ప్రసాద్‌కు శ్రీ ఆచార్య డైరెక్టు చేసిపెట్టాలి. ఇటీవల విడుదలయిన 'చిక్కడు—దొరకడు' చిత్రం కూడా బాగానే పోతూంది. విఠలాచార్య చిత్రాలకు మినిమమ్ గ్యారంటీ వుంది.



'పూలరంగడు'లో శోభన్ బాబు, విజయనిర్మల.

* * *

'చిలకా—గోరింకా' చిత్రంలో చక్కటి నటనను ప్రదర్శించిన శ్రీ కృష్ణంరాజుకు ఆ తర్వాత అవకాశాలు రాకపోవడం చిత్రాతి విచిత్రమే. ఈ పరిశ్రమలో ట్యాలెంట్ కన్నా లక్కుకే ఎక్కువ పవర్. అందుకే కృష్ణంరాజుకు ఛాన్సులు తగలలేదు. పద్మనాభం ఒక మంచి పాత్రను తాము నిర్మించనున్న చిత్రంలో యిచ్చినట్లు కృష్ణంరాజు వెల్లడించారు.

**హస్తవాసి మంచిది**

కృష్ణంరాజు యిలా చెప్పారుగదానని పద్మనాభం యింటికెళ్లాను. అక్కడ హీరో హరనాథ్, రామకృష్ణలు, విలన్ సత్యనారాయణ ఆయన చేతిమీదుగా కొత్త సంవత్సరం డైరీలను తీసుకుంటూ వుండడంచూచి 'ఏమిటండీ అందరూ ఆయనదగ్గరే తీసుకుంటున్నా'రని ప్రశ్నించాను. దానికి వాళ్లందరూ యిచ్చిన సమాధానం యేమిటో తెలుసా! 'ప్రతి యేడాది అంటే జనవరి 1 వ తేదినాడు పద్మనాభం దగ్గర డైరీ తీసుకోవడం పరిపాటి. ఆయన హృదయం వెన్న వంటిది. ఆయన హస్తవాసి చాలామంచిది.

## సినిమా డైరీ

- సబ్జెక్టు మారడం వల్ల నవజ్యోతి పిక్చర్స్ నిర్మించే సాంఘికంలో కుమారి కాంచనను కథానాయిక పాత్రకు నిర్ణయించారు.
- తెనాలిలో శ్రీ పి. బి. శ్రీనివాస్, శ్రీమతి జానకిల పాటకచ్చేరి మూడుగంటల సేపు ప్రేక్షకుల కరతాళధ్వనుల మధ్య బ్రహ్మాండంగ జరిగింది.
- రవీంద్రా ఆర్ట్సు పిక్చర్స్ చిత్రంలో కుమారి భారతి నాయికగా నటిస్తూంది. శ్రీ నాగేశ్వరరావుతో ఆమె నటించే ద్వితియ చిత్రం యిది.
- విజయవాడలో 'నాటకశాల' నిర్మాణనికి శ్రీ నాగేశ్వరరావు అతిత్వరలోనే పూనుకుంటారు.
- రేఖా అండ్ మురళీ ఆర్ట్సు నిర్మించే సాంఘిక చిత్రంలో నటించడానికి శ్రీ అక్కినేని నాగేశ్వరరావు అంగీకరించారు.
- చక్రవర్తి చిత్ర నిర్మించిన 'సుడిగుండాలు' చిత్రంలో చాలా మంది కొత్త నటీనటులకు అవకాశం యివ్వబడింది.
- ప్రముఖ తమిళ నటుడు శ్రీ ఎం. ఆర్. రాధా మద్రాసులో నివసిస్తూ చిత్రాల్లో నటించేందుకు వీలుపడదని హైకోర్టు నిర్ణయించింది.
- వీనస్ అండ్ పద్మిని కంబైన్స్ 'లక్ష్మీనివాసం' చక్రవర్తిచిత్ర వారి 'సుడిగుండాలు', విజయ 'సారథి ప్రొడక్షన్స్'వారి 'నిండుపూజ', ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ వారి 'బ్రహ్మచారి', మధు పిక్చర్స్‌వారి మంచి కుటుంబం' ... సెవెన్ యిన చిత్రాలు.
- హిందీ నటి రాజశ్రీ, ఆమె భర్త గౌతమ్ (గ్రెగరీచాప్‌మన్)లు పూనానుంచి బొంబాయి తిరిగి వస్తుండగా లోనావలా అనే ప్రాంతంలో కారుప్రమాదానికి గురైనారు. రాజశ్రీకి చిన్నచిన్న గాయాలు తగిలాయి. గౌతమ్‌కి మాత్రం పలుచోట్ల పెద్ద పెద్ద గాయాలు తగిలి స్పృహ కోల్పోయాడు. వీరిద్దరూ కొత్త సంవత్సరం వేడుకలు పూనాలో జరుపుకుని తిరిగి వస్తుండగా ఈ దుర్ఘటన జరిగింది. ఆ సమయంలో కారు నడుపుతున్న రాజశ్రీ ప్రమాదం సంభవించిన అనంతరం వేరే కారులో తన భర్తని బొంబాయి తీసుకువెళ్లింది. గౌతమ్‌కి 12 గంటల తర్వాత స్పృహ వచ్చింది. డాక్టర్లు అతనికి ఆపరేషన్ చేయాలనుకుంటున్నట్లు తెలుస్తూంది.

అందుకే కొత్త సంవత్సరాన్ని ఆయనతో ప్రారంభిస్తా'మన్నారు. నేనూ పద్మనాభం గారికి నూతన సంవత్సర శుభాకాంక్షల నందచేస్తూ 'మీపిక్చర్ డిటయిల్స్ చెప్తారా?' అని అనిగాను.

## దర్శకుడిగా మొదటి ప్రయత్నం

'మార్చినుండి 'శ్రీరామకథ' పౌరాణిక చిత్రాన్ని భారీఎత్తున నిర్మిస్తున్నాను. శ్రీ వీటూరి వ్రాసిన యీ కథలో నారదుడు నాయకుడు. నారదుడిగా నేను నటిస్తున్నాను. శ్రీరాముడిగా హరనాథ్, భూదేవి —శ్రీమతిగా జయలలిత, సీతగా శారద, మకరధ్వజుడిగా గుమ్మడి, పర్వతుడిగా రామకృష్ణ నటిస్తారు. వీరుగాక అంజలీదేవి, సూర్యకాంతం, రేలంగి, బాలకృష్ణ, రామచంద్రరావు ప్రముఖపాత్రల్ని పోషిస్తారు శ్రీ కోదండపాణి సంగీతాన్ని అందిస్తారు అన్నారు. దర్శకత్వం సంగతేమిటీ? అని ప్రశ్నించాను. 'నేనే డైరెక్టు చేస్తానండీ.దిస్యిజ్ మై ఫస్ట్ అటెమ్ప్ట్ యాజ్ఎ డైరెక్టర్' అన్నారు పద్మనాభం.

* * *

'లేతమనసులు' 'పదరంగం', 'పెద్దక్కయ్య' చిత్రాల్లో మంచి నటనను చూపెట్టిన శ్రీ హరనాథ్‌రాజు ప్రస్తుతం డజను చిత్రాల్లో వివిధ స్వభావాలుగల్గిన కథానాయకుడి పాత్రల్ని పోషిస్తున్నారు. స్ఫురద్రూపి అయిన హరనాథ్‌కు వాయిస్ కూడ మధురంగానే వుంటుంది. ఇతడు నటించిన చిత్రాలన్ని విజయవంతమయినవే. ఈ సత్యాన్ని గుర్తించిన మన నిర్మాతలు హరనాథ్‌ను యిప్పుడిప్పుడే ప్రోత్సహిస్తున్నారు. హరనాథ్ తనవృత్తి పట్ల ఆసక్తిని, నిర్మాతలపై మంచి తనాన్ని, దర్శకులపై గురుభావాన్ని సమపాళ్లలో ప్రకటిస్తూ అందరిచేత 'మంచివాడు' అనిపించుకుంటున్నాడు.



'కాంభోజరాజుకథ'లో శోభన్ బాబు, వాణిశ్రీ.



ఇప్పుడు హరనాథ్ 'శ్రీరామకథ'లో, బాలన్ ప్రొడక్షన్‌లో, రామసేఆర్ట్సులో, కల్పనా చిత్రలో, నవజ్యోతిలో, ఎస్. వి. ఎస్. లో, గౌరి నిర్మించే మరియొక సాంఘికంలో, చలం నిర్మించే సాంఘికంలో ముఖ్యపాత్రల్ని ధరిస్తున్నారు.

**'సహకారాన్నందించే నటి'**

'కృష్ణకుమారిలాగా సహకరించే ఆర్టిస్టులుంటేనా నిర్మాతలు, దర్శకులు



# సినిమా

డిఫికల్టీని ఫీల్‌గారు' అన్నారు నిర్మాత రామానాయుడు. మన చిత్రరంగంలో యెవరు చెప్పినా, ఎక్కడ విన్నా ఇదే మాట వినిపిస్తుంది. ఈమెలో వుండే యీ మంచిగుణమే యీమెను అందరికీ కావలసిన నాయికగా చేసింది అనడంలో తప్పులేదు. 'స్త్రీ జన్మ' చిత్రంలో విశిష్టమయిన నటనను ప్రదర్శించిన కృష్ణకుమారి షుమారు పది చిత్రాల్లో ప్రముఖ కథానాయకులతో నటిస్తూవుంది శ్రీ నాయుడు నిర్మించనున్న తదుపరి జానపద చిత్రంలో కూడ కృష్ణకుమారి నాయికగా నటిస్తుంది అని, యీచిత్రం యొక్క షూటింగు 'పాపకోసం 'విడుదల కాగానే ప్రారంభిస్తామని యిటీవల వారి ఆఫీసులో వెల్లడించారు.

'పాపకోసం' చిత్రం విజయవంతంగా ప్రదర్శింపబడితే, తమిళంలోకూడ నిర్మించ నిర్ణయించినట్లు శ్రీ నాయుడు వ్యక్తపర్చారు. 'అనివార్యకారణాలవల్ల హైద్రాబాదుకు వెళ్లవలసిన షెడ్యూలు క్యాన్సిల్ అయింది. మద్రాసులోనే తీస్తున్నాం' అని చెప్పారు శ్రీ నాయుడు.

* * *

విశ్వశాంతి విశ్వేశ్వరరావు యిప్పుడు పూర్ణంగా ఆరోగ్యాన్ని కోలుకున్నారు.



'నిలువుదోపిడీ'లో రామారావు.



నటి హేమమాలిని.

శ్రీ విశ్వేశ్వరరావు విద్యాధికుడు, విజ్ఞానవంతుడు మాత్రమేకాదు— సహృదయుడు, సరససంభాషణా చతురుడుకూడ. టెక్నీషియన్లను ప్రోత్సహించే నిర్మాతల్లో ముఖ్యుడు. మంచి కథకుడు; అందరికీ స్నేహపాత్రుడు. వారి 'నిలువుదోపిడీ' చిత్రం విడుదలకు సిద్ధమయింది. ఇది విడుదలవాగానే శ్రీ రామారావుతో ఒక సాంఘికాన్ని, 'బి' క్లాసు తారలతో వైజాగ్—టు—హైద్రాబాద్' చిత్రాన్ని నిర్మిస్తామని వ్యక్తం చేసారు.

**తమిళంలో సావిత్రి, తెలుగులో కృష్ణకుమారి**

'సావిత్రి తమిళంలో ధరించిన వేషాన్ని మన పిక్చర్‌లో కృష్ణకుమారి వేస్తూంది' అన్నారు డి. వి. ఎస్. రాజు 'టిక్కు శంకరయ్య' చిత్రాన్నిగూర్చి చెప్తూ. తమిళంలో విడుదలయిన 'మనంపోల్ మాంగల్యం' చిత్రాన్నే టిక్కు శంకరయ్యగా తెలుగులో నిర్మిస్తున్నట్లు, సురభి బాల సరస్వతి నటించిన భూమికను జయలలిత తెలుగులో పోషిస్తున్నట్లు, శ్రీ ఎన్. టి. ఆర్. పిచ్చివాడిగానూ, నాగరిక యువకుడిగానూ ద్విపాత్రాభినయం చేస్తున్నట్లు, షూటింగు పూర్తయినట్లు (ఔట్‌డోర్ మినహాయించి), మార్చి మాసంలో విడుదల చెయ్యాలను కుంటున్నట్లు వెల్లడించారు. శ్రీ యోగానంద్ దర్శకత్వాన్ని నెరపుతున్న యీ సాంఘిక చిత్రానికి శ్రీ టి. వి. రాజు సంగీతాన్ని సమర్పించారు.

—శ్రీనివాస్


Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

సంక్రాంతి శుభాకాంక్షలతో

వినోదమే ప్రధానమైన
ఒక అపూర్వ హాస్యరసమయ చిత్రం
ఇందలి పాత్రలు, సన్నివేశాలు కేవలం
కల్పితాలు.....

మంజులా వారి
చిత్రం...

# నిలువు దోపిడీ

నిర్మాత..U.విశ్వేశ్వరరావు, B.Sc.
దర్శకత్వం..C.S.రావు, B.A.(Litt)
సంగీతం..K.V.మహాదేవన్

ఆంధ్ర...జోతీ పిక్చర్స్
సీడెడ్...జయలక్ష్మి పిక్చర్స్
నైజాం...దివ్యదత్త




వస్తూన్నది!